# సృజన

మాసపత్రిక
72
అక్టోబర్ 1977
జనచైనా విప్లవ విజయ ప్రత్యేక సంచిక

## మావో, చౌ ఎన్‌లైల వారసత్వం పై మావో ఆఖరి కవిత (1975)

తమ ప్రజలకోసం ఎన్నో త్యాగాలు చేసిన
నిజాయితీ పరులైన తలిదండ్రులు
చివరకు తప్పని చావు గురించిభయపడరు.
ఇప్పుడు మనదేశం అరుణారుణమైంది కదా
దీని పోషకులుగా ఎవరుంటారు?
మన లక్ష్యం అసంపూర్ణంగానే వుండిపోయింది
ఇంకా వెయ్యి సంవత్సరాలు పట్టవచ్చు (పట్టనీ)
పోరాటంలో మనం పండిపోయాం
మన వెంట్రుకలు తెల్లబడ్డాయి
నువ్వూ నేనూ పాతమిత్రులం
మన కృషి తుడిచిపెట్టుక పోతుంటే
ఊరక చూస్తూ వుండగలమా?

[అమెరికా నుంచి వెలువడే 'టైం' పత్రిక నుంచి]

నిర్వహణ
సాహితీ మిత్రులు

సంవత్సరచందా 15 రూపాయలు      ఈ సంచిక 2 రూపాయలు

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

అక్టోబర్ 1977 మాసపత్రిక 72

| | | | |
|---|---|---|---|
| సంపాదకీయం... | | | 3 |
| చైనాగీతం | | —చెరబండరాజు | 4 |
| రెండు కవితలు | | —మావో | 5 |
| కళలూ సారస్వతంపై అయిదు సమరశీల డాక్యుమెంట్లు | | —మావో | 8 |
| 'పోరాటశక్తులకు పిలుపు'- ముందుమాట | | —లూసున్ | 14 |
| ఒక ఘటన | —కథ | —లూసున్ | 23 |
| ఓ పువ్వు పూసింది | —కవిత | —శివసాగర్ | 25 |
| ఎదురుతిరిగితే.... | —పెద్దకథ | —అల్లం రాజయ్య | 26 |
| చైనాలో కొత్త రంగస్థల రూపకాల సంచలనం | | | 52 |
| చైనాలో కొత్త నవలలు | | | 54 |
| చైనా గురించి మూడు మహాగ్రంథాలు | - సమీక్ష | —ఓవెన్ లేటిమోర్ | 66 |
| పరిచయం: కిరణాలు (మృతవీరుల సంస్మరణ గేయాలు) | | —జీ.డి. | 68 |
| Dissenting voices (ఏ యు.సి ఎల్. ఢిల్లీవిభాగం కవితా సంకలనం) | | —జీ.డి. | 69 |
| సమీక్షలు: "తూర్పు" రచయితల వర్క్‌షాప్ మార్పు" | | —జీ.డి | 76 |
| సమర తిమిర కవి "అల్పమైన కృషి" | | —విక్రమ్ | 78 |
| స్వీకారం: | | | 82 |
| సాహిత్యలేఖ: 'పరిటాల శ్రీరాములు- చైతన్యసాహితి' | | —జైరామ్ | 83 |
| విరసం కార్యవర్గం తీర్మానాలు | | | 84 |

ప్రజాపోరాటాలను ప్రతిబింబించే ప్రజాసాహిత్య వేదిక సృజన మీ చేతుల్లో వుంది. ఎక్కువ సంఖ్యలో చందాదారులుగా చేరి విరివిగా విరాళాలు, రచనలు యిచ్చి పత్రికను కాపాడుకోవాల్సిన బాధ్యత మీదే.

Edited, Printed and Published by P. Hemalatha for 'Sahithee Mithrulu' Printed at Sri Varalaxmi Press, Hyderabad for Venkatramana mudranalayam, Warangal.
Working Editor Vara Vara Rao.

# మావో జనచైనా - 'ప్రజల నుంచి ప్రజలకు'

చైనాను విముక్తి పథంవైపు నడిపించి నవచైనాకు జనచైనాకు రూపకల్పన చేసిన మహానాయకులు చౌఎన్‌లై, చూతే, మావోలు లేకుండానే రెండోమారు విప్లవ విజయోత్సవాలను ఈ అక్టోబర్ 1న జరుపుకోబోతున్నది జనచైనా. అయితే జనచైనాకు విప్లవం ఉత్సవంకాదు ఉద్యమం. నినాదంకాదు జీవితం.

విప్లవాన్ని తాత్త్విక వివేచన స్థాయికి అక్కడినుండి రక్తమాంసాల్లో జీర్ణించిన జీవన విధాన స్థాయికి రసాయనక్రియ లాగా కొనిపోయిన విశిష్టత చైనా కమ్యూనిస్టు పార్టీది- దాని నాయకుడు మావో- సే- టుంగ్‌ది. ఆయన పరిపూర్ణ మానవుడు కాకపోవచ్చు, కాని ఆయన నూతన మానవుడు 'ప్రజలకు సేవచేయండి' అన్నది ఆయన ఆకాశమంత ఎత్తునుంచి ఇచ్చిన సందేశం కాదు. ఈ నేలలో జనంలో నీటిలో చేపలా మసలి చెప్పిన ఆచరణాత్మకమైన మాట. ప్రజలనుంచి నేర్చుకుని ప్రజలను ముందుకు నడిపించిన బాట. శత్రువును సరిగ్గా కనిపెట్టి ఏకాకిని చేసి, పీడితులు పీడకులకు వ్యతిరేకంగా పీడిత లోకాన్నంతా ఒక్కటి చేసిన ఐక్య సంఘటనా వ్యూహామతనిది. ప్రజాశక్తి మీద అచంచల విశ్వాసం ప్రజలే చరిత్ర నిర్మాతలన్న గతితార్కిక సత్యంపై గాఢమైన ఆలంబన- ఇవీ మావోకు డెబ్బైకోట్ల ప్రజల జీవనాడిని పట్టియిచ్చినవి. నిలిచే నీళ్ళలో కాదు ప్రవాహంలో ఆయన కనిపిస్తాడు. మొహాన్ని సరిగ్గా చూడాలంటే అద్దాన్ని దుమ్ము పారకుండా తుడువాలని చెప్పిన చిన్న మాటల్లోనే ఆయన సాంస్కృతిక విప్లవ స్వభావం వున్నది. ఈనాడు చైనాలో జరుగుతున్న పరిణామాలపై తీర్పు యిచ్చే తొందరపాటుకన్నా విముక్తి కోసం 'లాంగ్ మార్చ్' చేసిన చైనా ప్రజల సుదీర్ఘ విప్లవానుభవాన్ని 'నూతన మానవుని' ఆవిష్కరణ కోసం ఆరంభించిన సాంస్కృతిక విప్లవ సాంప్రదాయాన్ని మననం చేసుకుంటే 'మహా సంక్షోభం గొప్ప శాంతికి దారితీస్తుంది' అనే వైరుధ్యాల సూత్రం విశద మవుతుంది.

భారత ప్రజల విప్లవ పోరాటంలో మావో ఆలోచనా విధానం- చైనా విప్లవ పథం 'సూక్ష్మదర్శినీ, దూరదర్శినీ.' మహత్తర

(మిగతా 4వ పేజీలో)

# చైనాగీతం

— చెరబండరాజు

పీడిత జాతికి ఆశా జ్యోతి
ప్రపంచ విప్లవ కేంద్రం ఏదీ
అదిగో అదిగో జనచైనా
ఎర్రబావుటా నవచైనా
దురాక్రమించే దుష్ట శక్తులకు
సింహాస్వప్న మది ఏదేశం
అదిగో అదిగో చైనాదేశం
కదులుతున్న జనక్రాంతి ప్రవాహం
జారులు చోరులు లేనే లేని
మానవహృదయం ఎచటుంది
అదిగో అదిగో జనచైనాలో
అరుణ తారయై వెలిగింది
ద్రోహం మోసం దోపిడి ద్వేషం
కనిపించని కలఫలించె నెచట
అదిగో అదిగో చీనావనిలో
సమస్త జీవన రంగస్థలిలో
బడుగుదేశముల గుండెలు కాల్చే
కుట్రలు ఎరగనిదే దేశం
అదిగో అదిగో చైనాదేశం
విప్లవ మార్గం విడవని దుర్గం
మనిషిని దేవుని ఖర్మకు వొదలని
మానవదేశం ఎచటుంది
అదిగో అదిగో హిమవన్నగాల
శిఖరాలందిన చీనాస్వర్గం

2-9-75. సెంట్రల్ జెయిలు, హైదరాబాదు

---

భారత ప్రజలు సోదర చైనా ప్రజల విముక్తి పోరాటం నుంచి ఉత్తేజాన్ని, పాఠాలను తీసుకోకుండా ముందుకు సాగలేరు. ఎందుకంటే అది ప్రజాపంథా, అది ప్రజా విజయం.

—సంపాదకుడు.

# చింకాంగ్‌షాన్ పునర్దర్శనం

మేఘాల అంచులకు చేరుకోవాలని నేను చిరకాలంగా
కోరుకుంటున్నాను,
మా పాత ఆవాసం చింకాంగ్‌షాన్ (శిఖరాల) నధిరోహించ
డానికి
నేను మళ్ళీ చాలా దూరం నుంచి వచ్చాను.
గతంలోని దృశ్యాలను మార్చేసిన నూతన దృశ్యాలు,
పాడుతూ బంగారు పిచ్చుకలు, ఆడుతూ వానకోయిలలు,
సుళ్ళు తిరుగుతూ సెలయేళ్ళు అంతటా.
ఆకాశం వేపు సాగిపోయే రోడ్డు
హువాంగ్ వాంగ్ చీ దాటామంటే
ఇంక ప్రమాదకరమైన స్థలం కనిపించదు.
మానవులు జీవించే ప్రతిచోటా
గాలీ మబ్బులూ సందడి చేస్తున్నాయి
జెండాలు ఎగురుతున్నాయి
వేళ్ళు చిటుక్కున విరిచినంతలోనే
ముప్పైఎనిమిదేళ్ళు పరిగెత్తి పోయాయి.
మనం తొమ్మిదో స్వర్గంలోవున్న చంద్రుణ్ణి అందుకోగలం
ఐదు సముద్రాల అట్టడుగు లోతుల్లోవున్న తాబేళ్ళను
పట్టుకోగలం.
విజయగీతాలతో, కేరింతల మధ్యన తిరిగివస్తాం
శిఖరాల నధిరోహించడానికి నువ్ సాహసిస్తే
ఈ ప్రపంచంలో ఏదీ కష్టం కాదు.

# రెండు పక్షులు: ఒక సంభాషణ

బృహత్పక్షి[1] రెక్కలు గిరుగ్గిన విసురుతూ
తొంభై వేల లీలు[2] ఆకాశంలో ఎగురుతూ
తీవ్రమైన తుఫానులను రగిలిస్తున్నది.
తన వెనుక నీలాకాశం
పట్టణాలతో నగరాలతో కూడిన మానవ ప్రపంచాన్ని
పరిశీలించడానికి అదికిందికి చూస్తున్నది.
ఆకాశాన్ని నాకుతూ తుపాకి రవ్వలు,
నేలను గుంతలు చేస్తూ మందుగుండ్లు
ఒక పిచ్చుక తన పొదలో భయపడి బిగుసుకు పోయింది
''ఇది ఒక నానారకాల నరకకూపం!
నేనిక్కడనుంచి తుర్రున చాలా దూరం ఎగిరిపోవాలి.''
''ఎక్కడికని నేనడుగొచ్చునా?''
ఆధిభౌతిక[3] పర్వతాల్లోని మణిమయ ప్రాసాదం లోకి
రెండు సంవత్సరాల క్రితం స్వచ్ఛమైన శరచ్చంద్రుని
కాంతి కింద
ఒక త్రైపాక్షిక ఒప్పందంపై సంతకాలు అయ్యాయని
నీకు తెలియదా?

---

1. తూర్పు దేశాల కథల్లోని చాల పెద్దపక్షి, గండభేరుండం లాంటిది.
2. చైనా మైలు (సుమారు 633 గజాలు)
3. ఎల్ఫలాండ్ హిల్స్.

గొడ్డు మాంసం కలిపిన
వేడివేడి సెగలు చిమ్మే బంగాళాదుంపలుంటాయక్కడ
తినడానికి సమృద్ధిగా వుంటుంది''
''నీచెత్తగాలికబుర్లు కట్టిపెట్టు
అటు చూడు
ప్రపంచం తలకిందులుగా మార్చబడుతున్నది''

సాంస్కృతిక విప్లవకాలంలో 1965 లో మావో-సేటుంగ్ రాసిన పై కవిత 76 జనవరిలో ప్రచురింపబడింది. ''మహత్తరరాజకీయ ప్రాముఖ్యం వున్న సంఘటన'' గా యీ కవితను 'పీపుల్స్‌డెయిలీ' వర్ణించింది. ఇందులో ''మణిమయ ప్రాసాదం'' గురించి, మృష్టాన్నభోజన (Goulish) కమ్యూనిజంగురించి కలలు గంటున్న పిచ్చుక రష్యన్ రివిజనిజం. దాన్ని విప్లవ తుఫాను తుడిచి పెడుతుంది. ఇందులో పేర్కొన్న ''త్రైపాక్షికఒప్పందం'' పాక్షిక అణ్వస్త్ర నిషేధ సంధిని సూచిస్తుంది.

# కళలూ సారస్వతంపైనా వ్రాసిన అయిదు సమరశీల డాక్యుమెంట్లు

("లియాంగ్‌షాన్ గిరిజన తిరుగుబాటు దారులతో చేరిక" అనే ప్రదర్శన చూసి ఏనాన్ లోని పెకింగ్ సంగీతనాటక సమాజానికి రాసిన ఉత్తరం.)

*(జనవరి 9, 1944)*

మీ ప్రదర్శన చూసి, మీ అద్భుతమైన కృషికి ధన్యవాదాలు తెలియజేయాలని యిది రాస్తున్నాను. నట వర్గంలోని కామ్రేడ్స్ అందరికీ, దయచేసి నా ధన్యవాదాలు అందజేయండి. చరిత్రను సృష్టించేది ప్రజలే. కాని, ప్రాచీన సంగీతనాటకాలు (ఒపేరాలు) (జన సామాన్యం నుండి విడివడి దూరమైపోయిన సాహిత్యం, కళలూ కూడా) ప్రజలను ఎందుకూ కొరగాని వారని చెత్తాచెదారం లాగా చూపెడతాయి; దొరలు, దొరసానులు, వాళ్ళ గారాల బిడ్డలే రంగస్థలమంతా ఆక్రమించి పెత్తనం చెలాయిస్తారు. ఇలా తలకిందులయిన చరిత్రను, తిరిగి ఇప్పుడు మీరు సరిజేసి చారిత్రక సత్యాన్ని పునరుద్ధరించారు: ఈవిధంగా ప్రాచీన సంచీతరూపకాలకి ఒక కొత్త జీవితం ప్రారంభమైంది. అందుకనే యిది ప్రశంసార్హమైంది. మీరు చూపిన చొరవ పాత సంగీత రూపకాన్ని విప్లవకరంగా మలచడంలో నూతన యుగానికి నాంది. దీని గురించి ఆలోచనలు నాకు ఎంతో ఆనందం కలిగిస్తున్నాయి. మీరు మరిన్ని నాటకాలురాసి మరిన్ని ఎక్కువ ప్రదర్శనలిచ్చి, తద్వారా ఈ పద్ధతి సర్వసామాన్యమైన వాడుకలో స్థిరపడి దేశం నలుమూలలా వ్యాపించేలా తోడ్పడగలరని ఆశిస్తాను.

"వుసున్ జీవితం" సినిమా గురించి చర్చపట్ల తీవ్రంగా శ్రద్ధవంహించండి.

[మే 20, 1951]

"వు-సున్ జీవితం" లేవనెత్తిన సమస్యలు స్వభావరీత్యా చాలా మౌలికమైనవి. విదేశీ దురాక్రమణ దారులకూ, దేశీయ అభివృద్ధి నిరోధక భూస్వామ్య పాలకవర్గాలకూ వ్యతిరేకంగా చైనా ప్రజలు గొప్ప పోరాటం నడుపుతున్న యుగంలోను, చింగ్ వంశపు అవసాన కాలంలోను జీవించిన వు-సున్ వంటి వారు ఆ భూస్వామ్య ఆర్థిక పునాదినీ దాని ఉపరితల నిర్మాణాన్నీ పీసమెత్తయినా పెకలించడానికి కనీసం చిటికెనవేలయినా కదప లేదు– సరిగదా, తద్విరుద్ధంగా భూస్వామ్య సంస్కృతిని విస్తరింపజేయడానికి పిచ్చెత్తినట్టు కృషి చేశారు అంతేగాదు, భూస్వామ్య సంస్కృతిని వ్యాపింపజేయడానికి, లేనిపోని ప్రతిష్ఠను సంతరించుకోడానికి అభివృద్ధి నిరోధక భూస్వామ్య పాలకవర్గాలను నిస్సిగ్గుగా ఆశ్రయించారు. ఇలాటి నీచ ప్రవర్తనను మనం పొగడ వలసిందేనా? ఇటువంటి పరమ నీచప్రవర్తనను బాహాటంగా కీర్తించడం, ముఖ్యంగా అటువంటి పొగడ్తలు "ప్రజలను సేవించండి" అనే విప్లవాశయాన్ని అవమానపరుస్తూన్నప్పుడు విప్లవ రైతాంగ పోరాటవైఫల్యాన్ని తద్వ్యతిరేక శిబిరాన్ని ఉగ్గడించడానికుపయోగిస్తున్నప్పుడు మనం ఆ పొగడ్తలను సహించగలమా? వైఫల్యాల్ని అటువంటి పొగడ్తలను సహించి ఆమోదించడమంటే రైతాంగ విప్లవ పోరాటాన్ని, చైనా జాతినీ, చైనా చరిత్రనూ కించపరచే అభివృద్ధి నిరోధక ప్రచారాన్ని సహించి ఆమోదించడమూ ఆ ప్రచారం న్యాయమైనదేనని సమర్థించడమే అవుతుంది.

"వు-సున్ జీవితం" అనే సినిమా రావడం, అందులో వు-సున్‌పై ప్రత్యేకంగా పొగడ్తలు కురిపించడం, మనదేశంలోని సాంస్కృతిక రంగంలో సిద్ధాంత గందరగోళం ఏ స్థాయికి చేరుకుందో తెలియజేస్తుంది.

ప్రాచీనత తొలగిస్తూ నవీనత పెంపొందడం వల్లగాక, పాతనశించిపోకుండా పదిల పరిచేందుకు చేసేకృషివల్లా; కూలద్రోయ దగిన అభివృద్ధి నిరోధక భూస్వామ్య పాలక వర్గాలను కూలద్రోయడానికి జరిగే వర్గపోరాటం వలన గాక, పీడితప్రజల వర్గపోరాటాన్ని కాదని వు-సున్ పద్ధతిలో. వారిని ఆపాంక

---

ఈ రచన కామ్రేడ్ మావో రెన్‌మిన్‌రిబావోకు రాసిన సంపాదకీయం నుండి తీసుకోవడమయినది.

వర్గాలకు లోబరచడం వల్లనూ చరిత్ర అభివృద్ధి అవుతుందని చాలామంది రచయి తల అభిప్రాయం. చైనా ప్రజలను పీడిస్తున్న శత్రువులు ఎవరు, ఆశత్రువులకు లొంగిపోయి వారికి సేవజేసే వారిలో మెచ్చుకోదగినది ఏమైనావుందా అని తెలుసు కొనడానికి మనరచయితలు చరిత్రను అధ్యయనం చేయలేదు. అంతే గాక 1840 నల్లమందు యుద్ధం తర్వాత ఈ వంద సంవత్సరాలకు పైబడ్డ కాల మంతటిలో చైనాలో ఏయేనూతన సామాజిక ఆర్థిక రూపాలు, ఏయేనూతన వర్గశక్తులు, ఏయేకొత్త భావాలు వ్యక్తులు తల ఎత్తి పాతరూపాలు, శక్తులు, భావాలతో ఎలా పోరాడాయో కనుగొనడానికి వారేమీ ప్రయత్నించలేదు. అందువల్ల దేనిని ఆమోదించాలి-కీర్తించాలి, దేనిని ఆమోదించ కూడదు పొగడ కూడదు, దేనిని ఖండించాలి అనేది నిశ్చయించు కోవడంలో విఫలమయారు.

మార్క్సిజం బాగా గ్రాహ్యం చేసుకున్నారని పేరు మోసిన కొందరు కమ్యూనిస్టుల విషయం ప్రత్యేక శ్రద్ధతో గమనించదగ్గది. సామాజిక అభి వృద్ధి చరిత్రను- చారిత్రక భౌతిక వాదాన్ని- వారు నేర్చుకొన్నారు. కాని, ప్రత్యేకమైన చారిత్రక సంఘటనలు ఎదురైనప్పుడు (వు-సున్ వంటి) ప్రత్యేక చారిత్రక వ్యక్తులు, చరిత్రకు వ్యతిరేకంగా వుండే ప్రత్యేక భావాలు('వు-సున్ జీవితం' సినిమాలోనూ, వు-సున్ పైన వచ్చిన రచనల్లోనూ వున్నట్టు) ఎదు రయేసరికి వారు తమ విమర్శనాదృష్టి కోల్పోతారు, కొందరు ఆ అభివృద్ధిని రోధక భావాల కనుగుణంగా స్పందిస్తారు కూడా, సమరశీలమైన కమ్యూ నిస్టుపార్టీ లోనికి అభివృద్ధి నిరోధక బూర్జువా భావాలు చొరబారడం వాస్తవం కాదా? మరి, కొందరు కమ్యూనిస్టులు ఖచ్చితంగా గ్రహించామని చెప్పుకునే మార్క్సిజం ఎక్కడుంది?

పై కారణాలవలన, ఈ సమస్యపైగల గందరగోళపు ఆలోచనలను చక్కజేయడానికి గాను, వు-సున్ జీవితం అనే సినిమా పైన వు-సున్‌కు సంబంధించిన పుస్తకాలు, వ్యాసాలపైన తప్పనిసరిగా చర్చ జరగాలి.

## "ఎరుపు గది కల" అధ్యయనానికి సంబంధించిన ఉత్తరం
## (అక్టోబరు 16, 1954)

యు–పింగ్–పో ను ఖండిస్తూ రాయబడిన రెండు రచనలను యిందులో జతపరుస్తున్నాను. దయచేసి వీటిని చదవండి. 'ఎరుపు గది కల' అధ్యయనంలో ప్రామాణికుడని చెప్పుకోబడుతున్న, ఒక రచయిత తప్పుడు అభిప్రాయాలపై గత ముప్పై ఏళ్ళలో యిదే మొట్టమొదటి తీవ్రమైన దాడి. వీటి రచయితలు యిద్దరూ యూత్‌లీగ్ సభ్యులు. యు-పింగ్-పోను విమర్శింపవచ్చునా అని అడుగుతూ మొదట వీరు వెన్‌యిబావో (సారస్వతగజెట్) పత్రికకు జాబు రాసారు; కాని ఆ జాబు నిర్లక్ష్యం చేయబడింది. గత్యంతరం లేక, తమ మాతృ సంస్థ అయిన షాంటుంగ్ విశ్వ విద్యాలయ అధ్యాపకులకు రాసి వారి మద్దతుపొందారు. "ఎరుపు గది కల పై ఒక సంక్షిప్త వ్యాఖ్యానం" అనేదాన్ని ఖండిస్తూ రాసిన వారి రచన, విశ్వవిద్యాలయ పత్రిక 'వెన్‌షిఖె' (సారస్వతం, చరిత్ర, తత్వశాస్త్రం) లో ప్రచురింప బడింది. అప్పుడు పెకింగ్‌లో మళ్ళీ ఈ సమస్య తల ఎత్తింది. చర్చ, విమర్శ లేవదీయడానికి వీలుగా యీ రచనను రెన్‌మిన్‌రిబావో లో తిరిగి ముద్రించాలని కొంత మంది కోరారు. ఇది జరగలేదు. ఎందుకంటే, వేర్వేరు కారణాలపై అనేకులు దీనిని వ్యతిరేకించారు. (ముఖ్య కారణం: "ఈ వ్యాసం రాసింది అనామకులు" అనీ "పార్టీ పత్రిక యిష్టం వచ్చినట్టు వాద ప్రతివాదాలు సాగించడానికి వేదిక కాదు" అనీ) తత్ఫలితంగా, ఒక రాజీ కుదిరి యీ రచనను 'వెన్‌యిబావో' లో పునర్ముద్రించడానికి అనుమతించారు. తరువాత గువాంగ్‌మింగ్‌రిబావో లో 'సారస్వత చరిత్ర' పేజీలలో యీ యిద్దరు రచయితలూ యుపింగ్‌పో పుస్తకం "ఎర్రగది కల అధ్యయనం" గురించి రాసిన వ్యాసం ప్రచురింపబడింది. గత ముప్పై ఏళ్ళకు పైబడి ప్రామాణిక సారస్వత అధ్యయనంలో యువకులలో విష ప్రభావం కలిగిస్తున్న హుషి పద్ధతి బూర్జువా ఆదర్శవాదంపైన పోరాటం ప్రారంభం కాబోతున్నట్లు కనపడుతూంది. ఇదంతా యిద్దరు "అనామకులు" ప్రారంభించారు. సాధారణంగా "పెద్దలు" దీనిని నిర్లక్ష్యంచేస్తారు

---

ఈ ఉత్తరం కామ్రేడ్ మావో–సే–టుంగ్ చైనా కమ్యూనిస్టుపార్టీ కేంద్ర కమిటీ పోలిట్‌బ్యూరోలోని కామ్రేడ్స్‌కు, దీనికి సంబంధించిన యితర కామ్రేడ్స్‌కు వ్రాసినది.

లేదా ఆటంకపరచవచ్చు కూడా. ఆదర్శవాదంపై ప్రాతిపదికపై వారు బూర్జువా రచయితలతో ఐక్య సంఘటన కడతారు; వారు యిష్టపూర్వకంగానే బూర్జువా జీకి బందీలవుతారు. "చింగ్ కోర్టు అంతరంగిక కథ", "వుసున్ జీవితం" అనే చిత్రాలు ప్రదర్శించినప్పుడూ యించు మించు యింతే జరిగింది. దేశభక్తి యుతమైనదిగా వర్ణించబడ్డ "చింగ్ కోర్టు అంతరంగిక కథ" నిజానికి జాతీయ విద్రోహకర చిత్రం. కాని అది దేశమంతటా ప్రదర్శింపబడుతున్నా అది ఎప్పుడూ విమర్శింపబడలేదు. తిరస్కరించబడలేదు. 'వుసున్ జీవితం' విమర్శించ బడినప్పటికీ, యిప్పటి వరకూ దాని నుండి గుణపాఠాలు తీయబడలేదు అంతే కాదు, మన స్థితి ఎంత చిత్రంగా వుందంటే, యుపింగ్‌పో ఆదర్శవాదం సహించ బడుతూంది; యిద్దరు 'అనామకుల' సజీవమైన విమర్శ వ్యాసాలు అడ్డుకోబడు తున్నాయి. ఇది మనం శ్రద్ధ వహించదగినది

యుపింగ్‌పొ వంటి బూర్జువా మేధావుల పట్ల మన ధోరణి సహజంగా వారిని కలుపుకు వచ్చేదిగానే వుండాలి. కాని యువకుల మనస్సులను కలుషితం చేసే వారి తప్పుడు భావాలను మనం తప్పనిసరిగా విమర్శించాలి, తిరస్కరిం చాలి; వాటికి లొంగిపోకూడదు.

## సారస్వతం కళకు సంబంధించి రెండు సందేశాలు

### *ఒకటి: 1963 డిసెంబరు 12, సందేశం*

నాటకం, బేలెట్లు, సంగీతం, లలితకళలు నాట్యం, సినిమా, కవిత్వము, సాహిత్యము వంటి అన్ని కళారూపాలలోనూ ఎన్నో సమస్యలున్నాయి. వీటిలో కృషి చేస్తున్న వారు చాలా మంది వున్నారు. వీనిలో సోషలిస్టు పరివర్తనలో అనేక శాఖలలో సాధించినది అతి తక్కువ. అనేక శాఖలలో యింకా 'గతం' పెత్తనం చేస్తోంది. సినిమా, కొత్తకవిత్వం, జానపద పాటలు, లలితకళలు, నవలల్లో సాధించిన దాన్ని చిన్న చూపు చూడకూడదు. కాని వాటిలోకూడా సమస్యలు ఎక్కువగానే వున్నాయి. నాటకం వంటి శాఖల్లో సమస్యలింకా తీవ్ర మైనవికూడా. సాంఘిక ఆర్థిక పునాది మారింది. కాని యీపునాదికి ఉపక రించే ఉపరితల నిర్మాణంలో భాగంగా కళలు యింకా తీవ్ర సమస్యగానే మిగి

లాయి. కనుక మనం యీ విషయాన్ని అత్యంత శ్రద్ధగా పరిశీలించి అధ్యయనం చేయడం ప్రారంభించాలి.

అనేక మంది కమ్యూనిస్టులు, సోషలిస్టు కళలను గాక, భూస్వామ్య పెట్టుబడిదారీ కళను వృద్ధి చేయడానికి ఉత్సాహం చూపడం అసందర్భంకాదా?

రెండు: *1964 జూన్ 27*, సందేశం

గత పదిహేనేళ్ళలోనూ ఈ సంఘాలూ, వాటి ప్రచురణల్లో అత్యధిక భాగం (వానిలో కొన్ని మంచివి వున్నాయి) యించుమించుగా వీనిలోపని చేసేవారందరూ (*అంటే అందరూకాదు*) పార్టీ విధానాలను అమలు చేయలేదు. వారు పెద్ద గొప్ప బురాక్రట్‌లుగా ప్రవర్తించారు. వారు కార్మికులు, కర్షకులు, సైనికుల వద్దకు పోలేదు వారు సోషలిస్టు విప్లవాన్నీ, నిర్మాణాన్నీ ప్రతిఫలించలేదు. ఇటీవలి సంవత్సరాలలో వారు సేరుగా రివిజనిజం అంచుకు జారిపోయారు. వారు నిజంగా నిజాయితీగా తమను తాము సరిదిద్దుకొనకపోతే ముందెప్పుడో ఒకనాడువారు హంగేరియన్ పెటోఫీ క్లబ్‌లాగాతయారుగాకతప్పదు.



# 'పోరాటశక్తులకు పిలుపు' ముందుమాట

లూసున్

(లూసున్ తన తొలి కథల సంపుటి 'పోరాట శక్తులకు పిలుపు' అన్న పేరుతో విడుదల చేసినపుడు రాసిన ముందుమాట రచయితల చారిత్రక కర్తవ్యాన్ని గుర్తింపచేసే విలువైన రచన. జాతి మానసిక జాడ్యాన్ని నిర్మూలించటంలో మేధావుల బాధ్యతలను గుర్తింపజేసే సిద్ధాంతం

లూసున్ చైనా భాషలో అధునిక సాహిత్య ఉద్యమాలకు వైతాళికుడు. లూసున్ ఆధునిక సాంస్కృతిక విప్లవానికి అంకితమైన నాయకుడు, '1918 మే నెల 'నవయువత' సంచికలో 'ఒక పిచ్చివాని దినచర్య' అన్న తన తొలి కథతో భూస్వామ్య వ్యవస్థ మీద యుద్ధాన్ని ప్రకటించాడు. ఆధునిక చైనా సాహిత్య చరిత్రలో తొలి కథ కూడా అదే. ఆయన కథలు మూడు సంపుటాలుగా వచ్చాయి తర్వాత. అవి చైనా ప్రజా సాహిత్యంలో తరగని నిధులు.

లూసున్ తొలి జీవితంలో విప్లవ ప్రజా స్వామ్యవాది. తర్వాత కమ్యూనిష్టుగా పరిణత సాధించాడు. భూస్వామ్య, సామ్రాజ్యవాద రాజకీయ సాంస్కృతిక వినాశకర ధోరణులను తన నిశితమైన వాస్తవిక వాద బలంతో ఎదుర్కొని సాహిత్యంలో కొత్త ప్రమాణాలను స్థాపించిన లూసున్ చైనా ప్రజలు గర్వించే మహా రచయిత.

'పోరాట శక్తులకు పిలుపు' అన్న . ఈ ముందు మాటలో సాహిత్యాన్ని ఆయుధంగా ఎంచుకోవడానికి ప్రోత్సహించిన కారణాలు వివరిస్తాడు. ఈ వివరణ లూసున్ సాహిత్యాన్ని క్షుణ్ణంగా అర్థంచేసుకోవటానికి తోడ్పడుతుంది.)

—

యువకునిగా ఉన్నపుడు నేను కూడ చాల కలలు కన్నాను. వాటిల్లో చాల మరిచిపోయాను. మరచి పోయినందుకు పశ్చాత్తాప పడాల్సిన అవసరం కన్పించలేదు. గతాన్ని నెమరు వేసుకోవడం ఆనందాన్ని ఇవ్వొచ్చు. కొన్ని సార్లు ఆ జ్ఞాపకాలు నిన్ను ఒంటరిని చెయ్యొచ్చు. ఒంటరి పాత రోజుల్ని పట్టుకుని వేలాడ్డంలో ప్రయోజనం లేదు. అయితే నాలో ఉన్న బలహీనత ఏమిటంటే నేను గతాన్ని మొత్తంగా మరిచి పోలేను. నా జ్ఞాపకాల్లో నేను చెరి పేయలేని, అనుభవాలు ఈ కథలుగా అవతరించాయి,

సామాన్లు తాకట్టు పెట్టుకునే ఒక షాపువాని దగ్గరికి అక్కణ్నించి ఒక మందుల షాప్‌కి నాలుగేళ్ళకు పైగా సుమారుగా ప్రతిరోజు నా చిన్నతనంలో వెళ్తుండే వాడిని. అప్పుడు నా వయసు ఎంత ఉండేదో నాకు గుర్తులేదు. మందుల షాప్ కౌంటర్ నా ఎత్తున ఉండేది. నాకు రెట్టింపు ఎత్తున తాకట్టు పెట్టుకునే షాప్ కౌంటర్ ఉండేది. బట్టలూ నగలూ ఈ తాకట్టు పెట్టుకునే వానికి నా ఎత్తుకు రెట్టింపు ఉండే ఆ కౌంటర్ దగ్గర అందించి వాడు ఈసడిస్తూ ఇచ్చే పైసల్ని తీసుకునే వాడిని. చాలా ఏళ్ళుగా అనారోగ్యంతో బాధపడుతుంటే మా నాన్నగారి మందుల కోసం నా ఎత్తున ఉండే మందుల షాప్ కౌంటర్ దగ్గరకు పోయేవాడిని. ఇంటికి వచ్చిన తర్వాత కూడా వేరే పనులతో తీరిక లేకుండా ఉండేది. మందు లిచ్చే ఆ వైద్యుడు పేరున్న వాడవటం చేత అతడు అసాధారణ మైన మందులు ఉపయోగించే వాడు. చలికాలం తవ్విన మందు వేళ్ళనీ, మూడేళ్ళు మంచులో నానిన చెరుకునీ, ఇంకా ఇలాంటి వాటిని సంపాదించడం కష్టంగా ఉండేది అయినప్పటికీ మా నాన్న ఆరోగ్యం మరింత చెడిపోయి చివరికి చనిపోయాడు.

సంపదలో పుట్టి పెరిగిన వాళ్ళు పేదరికం అనుభవించాల్సి వస్తే ఆ పరిస్థితిలో ప్రపంచం అంటే ఏమిటో వాళ్ళకు తెలుస్తుందని నాకు అనిపిస్తుంది. ఈ వాతావరణాన్నీ, ఈ మనుషుల్నీ తప్పించు కోవటానికి అనుకుంటాను. నాన్‌కింగ్‌లోని కియాంగ్సీ నేవల్ అకాడెమిలో చేరటానికి వెళ్ళాలనిపించింది నాకు. ఆ రోజుల్లో కావ్యాలు అధ్యయనం చేయటం, ప్రభుత్వపరీక్షలు ఇవ్వడం గౌరవ

ప్రదంగా భావించేవారు ఈ విదేశీ చదువుల్ని చదివే వాళ్ళను ఎందుకూ పనికి రాని వాళ్ళకింద, విదేశీ దెయ్యాలకు అమ్ముడు పోయిన చేతకాని వాళ్ళకింద చూసేవారు. నా ప్రయాణపు ఖర్చుకోసం ఎనిమిది డాలర్లు పోగుచేసి యిచ్చి 'నీఇష్ట మొచ్చిందిచెయ్యి' అని చెప్పగలిగింది మా అమ్మ. తర్వాత కన్నీళ్ళు పెట్టుకుంది. తనకు దూరంగా పోతున్నందుకు, తనను ఒంటరిగా విడిచి పెట్టి పోతున్నందుకు.

నేను నాన్ కింగ్ వెళ్ళటమూ కియాంగ్సీ స్కూలులో చేరటమూ జరి గాయి సామాన్య శాస్త్రం, గణితం, భూగోళం, చరిత్ర, చిత్రలేఖనం, వ్యాయామ శిక్షణ మొదలయిన పేర్లు వినడం తొలిసారి అక్కడే. జీవ శాస్త్రం అక్కడ ఉండేది కాదు. అయితే 'మానవ శరీరం—నూతన అధ్యయనం' 'రసాయన శాస్త్రం-ఆరోగ్య సూత్రాల మీద కొన్ని వ్యాసాలు' అనే రెండు వుడ్ బ్లాక్ ప్రతులను అక్కడే చూసాను. నేను ఎరిగిన వైద్యులు మందులు నిర్ణయించ డాన్ని ఇప్పుడు నేను తెలుసుకున్న శాస్త్రీయ పద్ధతిని సరిపోల్చి చూస్తే ఆ వైద్యులు మూర్ఖులుగా, వొట్టి మాటల పోతులుగా తేలింది. అలాంటి పనికిరాని వైద్యుల చేతుల్లో నాశనమై పోయిన వ్యక్తుల జీవితాల పట్ల ఆ కుటుంబాల పట్ల జాలి కలిగింది. పాశ్చాత్య వైద్య శాస్త్రం జపాన్‌లో ప్రవేశించ డంతో జపాన్ ప్రగతికి తోడ్పడిన సంస్కరణోద్యమం ప్రధానంగా రూపొందిందని చరిత్ర గ్రంథాల అనువాదాలు చదవడంతో తెలిసింది.

ఈ భావాలు నన్ను జపాన్‌లో రాష్ట్రీయ వైద్యావిద్యా కళాశాల వేపు నడిపించాయి. నా చదువు పూర్తయిన తర్వాత స్వదేశానికి తిరిగి వచ్చి నాతోటి చైనా ప్రజలకు సేవ చేయగలుగుతానని. మా నాన్న లాంటి వ్యాధి గ్రస్తుల రోగాలను నివారించ గలుగుతానని అందమైన కలలు కన్నాను. యుద్ధ కాలంలో సైనిక వైద్యునిగా సేవ చేయగలుగుతానని ఆ రకంగా నా దేశ ప్రజలలో శాస్త్రీయ దృక్పథాన్ని సంపాదించే సంస్కరణానురక్తి కలిగించ గలుగు తానని భావించాను.

ఏ ఆధునిక పద్ధతుల్లో మైక్రోబయాలజీ ఇప్పుడు బోధిస్తున్నారో నాకు తెలీదుగాని అప్పట్లో లాంతరు స్లైడులు ఉపయోగించి మైక్రోబ్‌లను చూపించి

బోధించేవారు. బోధన తొందరగా ముగిస్తే ఇన్‌స్పెక్టర్ ప్రకృతి సుందర దృశ్యాలను, వార్తా చిత్రాలను మిగిలిన సమయంలో చూపేవారు, అదియూసో జపనీస్ యుద్ధ కాలం అవటం వలన యుద్ధానికి సంబంధించిన అనేక వార్తా చిత్రాలను చూపించేవారు. లెక్చర్ హాలులో ఆ ప్రదర్శనలు చూసేటప్పుడు అందరితో పాటు నేనూ చప్పట్లు కొట్టేవాడిని, జేజేలు చెప్పేవాడిని స్వదేశీయులైన చైనీయుల్ని చూసిన చాలా కాలానికి ఒక రోజు కొందరు చైనీయుల్ని ఒక ఫిల్మ్‌లో చూసాను. అందులో ఒకణ్ని చేతులు కట్టేసి ఉన్నారు. మిగిలిన వాళ్ళు అందరూ అతడి చుట్టూ నుంచున్నారు అందరూ దృఢంగా ఉన్నా మరీ దీనంగా కన్పించారు. వ్యాఖ్యానం మూలంగా తెలిసిందేమిటంటే చేతులు కట్టి పడవేసిన వ్యక్తి రష్యా తరఫున పనిచేసిన గూఢచారి. తల నరికేసి చంపుతారు అతడిని జపాన్ సైనికులు. ఇతర్లకు హెచ్చరిక చేయటం దాని ఉద్దేశం. పోతే అక్కడ చేరిన ఇతర చైనీయులు ఈ దృశ్యాన్ని చూసి సంతోషించడానికి చేరిన వాళ్ళు. ఈ ఫిల్మ్ చూసిన తర్వాత నాకేమని పించిందంటే వైద్యశాస్త్రం అంత ప్రధానమైంది కాదని. దాంతో గడువు పూర్తి కాకముందే ఆ చదువుకు స్వస్తి చెప్పి టోక్యో వెళ్ళిపోయాను. ఒక వెనకబడిన బలహీనమైన దేశం ప్రజలు వాళ్ళెంత దృఢంగా ఆరోగ్యంగా ఉన్నా ఇట్లాంటి పనికి మాలిన దృశ్యాలు చూస్తూనే ఉంటారు. అనారోగ్యంతో ఎంత మంది చనిపోతున్నారన్నది వాళ్ళకి పట్టనే పట్టదు. అంచేత అన్నిటికంటే ముఖ్యమయింది, అలాంటి వాళ్ళ మానసిక దృక్పథాన్ని మార్చడం. ఇది సాధించాలంటే సాహిత్యం మంచి సాధనం అని అప్పట్లో నాకు అనిపించింది. దాంతో సాహితీ ఉద్యమం ప్రారంభించాలని నిశ్చయించు కున్నాను. రాజనీతి శాస్త్రం, న్యాయశాస్త్రం, ఇంజనీరింగ్ విద్య, చివరికి పోలీసు శిక్షణసైతం పొందుతున్న చైనా విద్యార్థులు టోక్యోలో ఉన్నారు. కాని సాహిత్యం, చిత్రకళ చదివే విద్యార్థి ఒక్కడూ లేడు, ఇలాంటి అననుకూల వాతావరణంలో ఎలాగయితేనేం కొందరు ఉత్సాహవంతులు అదృష్టవశాత్తూ దొరికారు. మాక్కావలసిన మరికొందర్ని సమీకరించి. చర్చించి తొలి ప్రయత్నంగా ఆ పత్రిక పేరు కొత్త జన్మను సూచించేదిగా ఉండాలని అప్పట్లో మేమింకా సాంప్రదాయం వేపు మొగ్గు చూపడం వలన 'కొత్తబతుకు' అన్న పేరు ఎంచుకున్నాం.

ప్రచురణ సమీపించే సరికి మాతో కొందరు తమ సహకారాన్ని ఉపసంహరించుకున్నా చివరికి ముగ్గురం మిగిలాం. మాకు డబ్బులేదు. మా పత్రిక ప్రారంభమే ఒక దురదృష్ట ఘడియల్లో జరగటం వలన మా ప్రయత్నం విఫలం అయింతర్వాత దానిమీద ఫిర్యాదు చేయటానికి ఎవరూ మిగల్లేదు. తర్వాత మేం ముగ్గురం కూడా ఎగిరిపోయాము- భవిష్యత్ కోసం మేం కన్న కలలన్నీ వదులుకుని' ఆ రకంగా "కొత్తబతుకు" పురుటిలోనే సంధికొట్టి ముగిసింది.

అప్పుడు ఇంకేమి అర్థం కాలేదునాకు. ఆతర్వాత మాత్రం దీని నిరుపయోగత తెలిసొచ్చింది. ఒకానొక వ్యక్తి ప్రయత్నం కలిసొస్తే అది ఆతన్ని ఉత్సాహపరుస్తుంది. కలిసి రాకపోతే అతడు ఆ పరిస్థితిని ఎదుర్కోవాలి నిజంగా ఇక్కడ బాధపడాల్సిన సంగతేమిటంటే జనం మధ్య తన గొంతు, విప్పి అరచి చెప్పినా ఏరకమైన ప్రోత్సాహమూ అటుఇటు కన్పించక పోవడం. అంగీకారమో తిరస్కారమో ఏదో ఒకటి. అలాంటప్పుడు అనంతమైన ఎడారిలో నిస్సహాయంగా అతడిని విడిచిపెట్టినట్టుగా ఉంటుంది.ఆరకంగా ఏకాకి నయిపోయినట్టయిందీ నాకు.

పెద్ద విషసర్పం నా హృదయం సుళ్ళు తిరుగుతున్నట్టుగా రోజురోజుకీ ఈ ఒంటరితనం పెరిగిపోయింది. చెప్పలేని ఈ దుఖ్ఖానికి సైతం నాసహనం చెడిపోలేదు. తన పిలుపుతో వేలాది మందిని సమీకరించ గల చేవగల నాయకత్వంకోవకు నేను చెందనని స్పష్టంగా ఈ అనుభవంతో గుర్తించాను.

ఎట్లున్నా ఈ ఒంటరితనంని తొలగించుకోవాలి. అది తీరని వేదనని రేకెత్తిస్తుంది. వెనుకడుగువేసి, పరిస్థితుల ఒత్తిడికినా లొంగిపోయి సునిశితత్వాన్ని మొద్దుపరచటానికి చాలరకాలుగా ప్రయత్నించాను. దాంతో మరింత ఒంటరితనం, మరింత దుఖ్కం అనుభవం అయ్యాయి, ఆ బాధను గుర్తుతెచ్చుకోవడం కూడా ఇష్టంలేదు. అదినాలోనే నశించాలి, నా బుద్ధిని మొద్దు బార్చాలనుకున్న నా ప్రయత్నం ఫలించకపోలేదు. యవ్వనంలోని నా ఉత్సాహం, ఉద్రేకం చచ్చిపోయాయి దాంతో.

షావ్‌సింగ్ హాస్టల్‌లో మూడుగదులు ఉండేవి. అక్కడ ఒకామె

పెరట్లోని లోకస్ట్ చెట్టుకు ఉరేసుకుని చచ్చిపోయింది. ఆ చెట్టు ఇప్పుడు ఉరేసుకోటానికి అందనంత ఎత్తుకు పెరిగి పోయినప్పటికి ఆ గదుల్లో మాత్రం ఎవరూ దిగలేదు. నిర్మానుష్యంగా ఉండిపోయాయి. పురాతన శాసనాలను ఎత్తిరాస్తూ అక్కడే ఉండేవాణ్ణి. శాసనాల్లో రాజకీయ విషయాలుగాని సమస్యలుగాని లేవు. నన్ను చూడవచ్చేవాళ్ళు కూడ తక్కువ. అరకంగా నా జీవితం. గడిచిపోవాలని అనుకునే వాణ్ని. వేసవి రాత్రుల్లో, గదిలో దోమల బాధ ఎక్కువైతే. బయట లోకస్ట్ చెట్టు కింద విసనగర్రతో గాలి ఊపుకుంటూ చెట్లఆకుల సందుల్నించి ఆకాశం తళుకులు చూస్తూ గడిపేవాణ్ని. సాయంత్రం చెట్లమీద చేరుకున్న గొంగళిపురుగులు చల్లగా నా మెడమీద రాల్తుండేవి.

అప్పట్లో కబుర్లకాలక్షేపానికి వచ్చే ఒకేఒకనా పాత మిత్రుడు చిన్‌సిన్‌యి (*Chin Hsin - Yi*) తన కాగితాల దస్తరాన్ని విరిగిన టేబుల్‌మీద పెట్టి తన పొడుగాటి గౌను విప్పేసి కుక్కల్ని తప్పించుకుని వచ్చిన గుండెదడతో ఎదురుగా కూచునేవాడు.

'ఇవి ఎత్తిరాయడం వలన ఉపయోగం ఏమిటి' ఒకరాత్రి కుతూహలంగా అడిగాడు. నేను ఎత్తిరాస్తున్న శాసనాలు చూసి.

'ఏ ఉపయోగం లేదు'

'అయితే వాటిని ఎత్తి రాయడం ఎందుకు?,

'వొత్తినే'

'వేరేమన్నా రాయొచ్చు కదా మీరు?'

నాకు అర్థమయింది. వాళ్ళు 'నవయువత' అన్న పత్రిక తెస్తున్నారు, నేనెప్పుడూ పట్టించు కోలేదు. అనుకూలంగాగాని ప్రతికూలంగాగాని. పనిచేసే వాళ్ళు తక్కువయి ఇబ్బంది పడుతున్నట్టుంది.

'గాలి లోపలికి రావటానికి కిటికీలు కూడాలేని ఇనపగోడల ఇల్లు ఉందనుకోండి. గాఢ నిద్రలో లోపల ఉన్నవాళ్ళు ఊపిరాడక చచ్చిపోతారు నిద్రలో వాళ్ళు చచ్చిపోతారు కాబట్టి వాళ్ళకు మృత్యుబాధ తెలీదు. ఆ సంగతి

మీకు తెలుసు. గట్టిగా అరచి కొందర్ని మీరు నిద్రలేపితే చావునించి తప్పించలేని ఆదురదృష్ట వంతుల్ని బాధకు గురిచేయటం తప్ప ఇంకేమన్నా ఉపయోగం ఉంటుందను కుంటున్నారా? అన్నాను.

'కొందరు మేల్కొంటే ఆ ఇనుప గోడల ఇల్లును ధ్వంసం చేసి బయట పడొచ్చు అని ఆశించ వచ్చుగదా?'

నా నమ్మకం అట్లా ఉన్నప్పటికీ నేను ఆశను చంపుకోలేక పోయాను. ఆశ ఉనికి భవిష్యత్తులో. అందుచేత, ఆశ ఉంది అన్న అతడి వాదనని నా అనుభవం ఆధారంగా ఖండించలేదు, రాయటానికి ఒప్పుకున్నాను. దాని ఫలితమే నా మొదటి కథ 'ఒక పిచ్చివాని దినచర్య'- అది మొదలు కథలు రాయకుండా ఉండలేక పోయాను అప్పుడప్పుడు స్నేహితులు కోరినప్పుడల్లా ఏదో ఒక కథ రాసాను. అవి ఒక డజన్ మించాయి

నామట్టుకు నాకు రాయటానికి పెద్ద ఉత్సాహం ఇప్పుడు అంతగాలేదు. బహుశా నా పాత జీవితంలో, ఒంటరితనం దుఃఖాన్ని పూర్తిగా మరచిపోలేక పోవడం వల్లకావచ్చు. ఒంటరి తనంలో పోరాడే యోధుల్ని ప్రోత్సహించే ఉద్దేశంతో కొన్నిసార్లు రాస్తాను. ధైర్యాన్ని కోల్పోకుండా ఉంటారని. వాళ్ళకు నా పిలుపు సాహసంగా ఉందో, దుఃఖంగా ఉందో, వెగటుగా ఉందో, నవ్వులాటగా ఉందో లెక్కచెయ్యను. కాని పోరాట శక్తులకు పిలుపు ఇస్తున్నందుకు తప్పనిసరిగా నా జనరల్ ఆదేశానికి బద్ధుడనయి ఉండాలి నేను. అందుచేతనే భావగర్భితంగా ధ్వనింపజేసే పద్ధతి అవలంబిస్తాను నేను. 'మందు' కథలో కుమారుని సమాధి మీద పూలహారం ప్రత్యక్షమవటాన్ని 'రేపు' కథలో తన చిన్నారి కుమారుని జ్ఞాపకాలు నాల్గవ షాన్ భార్యను నడుపుతాయని చీకటిలో దాక్కున్న రాత్రి ఉదయంగా విచ్చుకుంటుందని చెప్పింది అందుకే. అందువలన నా ముఖ్య పాత్రలు నిరాశావాదానికి విరుద్ధం.

యవ్వనంలో నాకుమల్లే అందమైన కలలుకనే యువతరానికి చేదువిషం అనుకున్న ఒంటరితనాన్ని ప్రచారం చేయటం నాకు సంబంధించి నంత వరకు ఇష్టంలేదు. నా కథలు కళారూపాలుగా సమగ్రత లోపించి ఉన్నాయన్నది నాకు స్పష్టం. అయినప్పటికీ అవి కథలుగా గుర్తించ బడ్డాయి అంటే నేను అదృష్టవం

తుడనని భావించు కుంటాను. దానికి తోడు సంపుటిగా కూడ వెలువడుతున్నాయి. ఇలాంటి అదృష్టం ఇబ్బందిగా ఉన్నా, కనీసం ఈ వర్తమాన కాలంలో నన్నా ప్రపంచంలో ఈ కథలకు పాఠకులున్నారని సంతోష పడతాను.

పైన చెప్పిన కారణాల వలన నా కథలు ఒక సంపుటిగా పునర్ముద్రణ పొందుతున్నందున 'పోరాట శక్తులకు పిలుపు' అన్న పేరు ఎన్నుకున్నాను.

*డిసెంబర్ 3, 1922 పీకింగ్.*

"సోషలిజం కోసం నాటిన విత్తనాల్లాంటి వాళ్ళం మేము, ఓ వసంత సుప్రభాతాన ప్రపంచ వ్యాప్తంగా మొలకలు వేస్తాం మేము...స్వేచ్ఛా మానవుడు ఉదయిస్తాడానాడు. ప్రజలమధ్య సౌభ్రాతృత్వం వెల్లి విరుస్తుందానాడు మానవత వికసిస్తుందానాడు."

—జూలియస్ ఫ్యూజిక్

# ఒక ఘటన

— లూసున్

గ్రామసీమనుంచి రాజధానికి వచ్చి ఆరేళ్ళకాలం జారిపోయినట్టు గడిచింది. రాజ్యవ్యవహారాలు అనబడేవాటిని ఆకాలంలో ఎన్నెన్నో చూశాను, మరెన్నో విన్నాను గాని, నా మనస్సుమీద ఏదీ బలంగా ముద్ర వెయ్యలేక పోయింది. వాటి ప్రభావాన్ని నిర్వచించమని అడిగారంటే, నా ముక్కోపాన్ని అవి మరింత పెంచాయనీ మనసువిడిచి చెప్పాలంటే మరింత మానవద్వేషిగా నన్ను మార్చాయనీ మాత్రమే చెప్పగలను.

అయితే, అర్థవంతమైనదని కనిపించిన ఘటన ఒకటి ఉంది: చిరాకు నుంచి నన్నది తట్టిలేపింది. ఇప్పటిదాకాగూడా నేను దాన్ని మరిచిపోలేకుండా ఉన్నాను

1917 శీతాకాలంలో జరిగిందది. ఉత్తరంనుంచి పోరుగాడ్పు వీస్తూంది. బతుకుదెరువు కోసం నేను చీకటితోనే లేచి బైటికి వెళ్లాల్సిఉంది. రోడ్డుమీద పురుగైనలేదు– యస్. గేటువద్దకు నన్ను తీసుకెళ్లేందుకు ఎంతోకష్టం మీదగాని రిక్షాబండి దొరకలేదు. కాస్సేపటికి గాలిజోరు కొంచెం తగ్గింది. ఆపాటికి దుమ్ముధూళి సాంతం ఎగిరిపోయి రోడ్డు శుభ్రంగా ఉంది. రిక్షామనిషి వేగం హెచ్చించాడు. యస్– గేట్ సమీపానికి వచ్చేసేటంతలో రోడ్డు దాటుతూన్న మనిషి ఎవరోగాని మారిక్షాలో చిక్కుబడి మెల్లిగా పడిపోవడం జరిగింది.

చినిపిరి బట్టలు ధరించి తెల్లటిదారల తలవెండ్రుకలు గల ఆడకూతురు ముందు హెచ్చరికేమీలేకుండానే పేవుమెంటు మీది నుంచి మా ముందరగా దూసుకుని పోదామనుకుంది. పేలికలు వాలికలుగా ఉన్నతన జాకెట్టు, బొత్తాములు గిత్తాములూ లేవేమో, గాలికి రెపరెపలాడుతూవచ్చి రిక్షా ఏరుగాలుకు తగులుకొంది. అదృష్టం బాగుండబట్టి రిక్షామనిషి ఆపాటికే ఆపుకున్నాడు గాని లేకుంటేనా, బిళ్లపాటుగాపడి బలంగాగాయపడి ఉండేది.

నేల మీద పడివుంది. రిక్షా మనిషి ఆగాడు, ముసల్దానికి దెబ్బ తగిలి నట్టు నాకు అనిపించలేదు; జరిగిన దాన్ని కళ్ళారా చూచినవాడూ లేడు; కాబట్టి ఈ అతి ప్రమేయం నాకు సరిపడిందికాదు. ఇందువల్ల ఇతగాడూ చిక్కుల్లో పడవచ్చు., నా పని నిలిచి పోవచ్చు.

"మరేం ఫర్వాలేదులే" అన్నాను. "పోనీ!"

నా మాటలు చెవిని బెట్టనేలేదు.— బహుశా వినపడలేదేమో ఇతనికి-ఏరుగాళ్ళు నేలకానించి, జాగర్తగా ముసలిదాన్ని పైకెత్తాడు. ఒకచేత్తో వూతమిస్తూ "బాగానే ఉన్నావా?" అని అడిగాడు.

"దెబ్బ తగిలింది."

ఎంత మెల్లిగా పడిందో నేను స్వయంగా చూశాను, దెబ్బతగిలేందుకు వీల్లేదని నాకు నిశ్చయమే. దొంగవేషా లేస్తున్నట్టుంది. ఇదే చిరాకు. రిక్షా మనిషి చిక్కులు తెచ్చుకుంటున్నాడు. ఇప్పుడు బయటపడే దారి తనంత తాను చూచుకోవలసిందే.

దెబ్బ తగిలిందని ముసల్ది చెప్పాక రిక్షా మనిషి మరొక్క నిమిషమైనా తటపటాయించలేదు. దాని చేతినింకా అలాగే పట్టుకుని, మెల్లిగా ముందుకి నడిపించుకుపోయాడు నాకు ఆశ్చర్యమైయింది. ముందుకు చూద్దునుగదా, పోలీసు స్టేషను కనిపించింది, ఎత్తుగాలి కారణంగా, బైట ఎవరూ లేరు. గాబట్టి రిక్షా మనిషి ముసల్దాన్ని గేటుదాకా తీసుకెళ్ళాడు.

హఠాత్తుగా నాకు విచిత్రమైన అనుభూతి కలిగింది. దుమ్ముకొట్టుకుని దూరమై పోతూన్న అతడి ఆకారం ఆక్షణంలో పెద్దదౌతున్నట్లు తోచింది. నిజానికి మరింత దూరమౌతున్నకొద్దీ మరింత పెద్ద వాడవుతున్నాడు, తలెత్తి చూడ వలసినంతగా పెరిగిపోతున్నాడు. అదే సమయాన క్రమ క్రమంగా నా మీద ఏదో ఒత్తిడి ప్రసరింపజేస్తున్నట్లున్నాడు; విలువైన నా గౌను కిందగల చిన్ని నా జీవుణ్ణి అది కమ్మివెయ్య బూనుకుంది,

ఖాళీపడిన మనస్సుతో నిశ్చలంగా సత్తువ వుడిగినట్టుగా నేనక్కడ చతి కిలబడి కూర్చుండి పోయాను. ఇంతట్లో ఒక పోలీసువాడు బైటికొచ్చాడు.

అప్పుడు మరి రిషా నుంచి కాలు కిందబెట్టాను. పోలీసువాడు నా వద్దకు వచ్చి "మరో రిషా తెచ్చుకొండి. వాడిక మిమ్మల్ని లాగలేడు" అన్నాడు.

ఏంచేస్తున్నానో ఆలోచించకుండానే నా కోటు జేబు నుంచి గుప్పెడు రాగి రూకలు తీసి పోలీసువాడి చేతికందించాను. "దయయుంచి వీటి నతనికివ్వండి" అన్నాను.

గాలి పూర్తిగా తగ్గింది. అయినా రోడ్డు ఇంకా సద్దణిగే ఉంది ఆలోచించుకుంటూ నడుచుకుపోయాను గాని ఆలోచనల్ని నా మీదికి తిప్పుకునేందుకే భయమైంది. కొంచెం సేపటి కింద జరిగినదాన్ని అటుంచి; ఆ గుప్పెడు రాగిరూకల నివ్వడంలో నేననుకున్న దేమిటి? పారితోషికమా అది? రిషామనిషి మంచి చెడ్డలు నిర్ణయించేందుకు నేనెవర్ని? నాకు నేనొక సమాధానం ఇచ్చుకో లేకపోయాను.

ఇప్పటికీ ఇది నా మనస్సులో చెక్కుచెదరకుండా నిలిచి ఉంది. తరచూ ఎంతో వ్యాకులపాటు కలిగిస్తూ నా గురించి ఆలోచించుకునేలా చెయ్యజూస్తుంది. చిన్నతనంలో చదువుకున్న ప్రాచీన గ్రంథాల నెంత పూర్తిగా మరిచిపోయానో ఇటవలి సైనిక రాజకీయ వ్యవహారాలనుకూడా మరిచాను. అయితే ఈఘటన వాస్తవ జీవితంలో కంటే మరింత స్పష్టంగా, నాకు లజ్జను గరపుతూ సంస్కరించుకొమ్మని కోరుతూ, సరికొత్త ధైర్యాన్నీ ఆశనీ ప్రసాదిస్తూ గుర్తు వస్తూ ఉంటుంది.

—(రచనా కాలం 1920 జూలై)

# ఓ పువ్వు పూసింది

—శివసాగర్

బంది ఖాన బృందావనంలో
ఒంటరిది
ఎవరికీ కానిది(?)
ఓ పువ్వు పూసింది
ఓ విరజాజి విరిసింది.

పొద్దు కునికే వేళ
తన ఒంటరితనాన్ని
తలచుకొని
అది వేదనా శకలమయింది.

అదినేడు
జడివాన దౌష్ట్యానికి
పెనుగాలి ధాష్టికానికి
గురి అవుతోంది.

రంగు రంగుల పువ్వుల్లారా!
రమణి ముద్దుల గుమ్మల్లారా!
ఆ పువ్వును చూసి
సిగ్గుతో మీ తలలు వంచండి

రేకులు వేకువలో రాలి
మన్నులో కన్నుమూసినా
దాని పరీమళాలు
కాలావధులు దాటి
గుబాళిస్తాయి

తనకోసం కాక
అందరికోసం వసంతం
దాని ఆకాంక్ష, దానితపన.

(చైనాకవి లియు కవిత ప్రేరణతో)

# ఎదురు తిరిగితే . . .

—అల్లం రాజయ్య

(గత సంచిక తరువాయి)

## 4

పడుమటికెల్లిఅంగిన పొద్దు కడ్డంగ నొసలు మీనపెట్టి కుడిసెయి నడుం మీనేసుకొని ఈ కొసనుంచి ఆ కొసదాక పారసూసిండు కొంరడు. తంగెడుసెట్లు తేకు మొట్లు, నడుమ నల్ల రేనుసెట్లు భూమి కన్పించకుంట పెరిగున్నయ్. సెలుక మజ్జెల్నుంచి ఒర్రె[1] కోసింది. అసలది సెలక[1a]నటాన్కి ఈల్లేదు. పిల్ల అడివనాలె.

"రేవుకు దేవాలె గాని భూమికి పేదెక్కడిది? కోమటోన్ని పేదనరాదట— భూమిని బక్కదనరాదట... ఎండకాలమంత మొట్లు మోరల్లు తవ్వి, సెట్లు కొట్టేసి, తూరుపుకెల్లి ఏడెనిమిది బంటాల మట్టి అక్కడ్డంగ[2] పోసి తెట్టెగడితె అయిపాయె. రాయిరప్ప లేరి ఇయ్యేట్కంత పెసల్లో, నూలో అలుకుత[3]— మాగిల[4] బాయి పొక్క బడుత[5]—పండక పోద్దా— సూత్ర అదురట్టం—ఆని భూమిల ఈని భూమిల రెక్కలిరుసుకుంటె ఇచ్చేది సరిగ్గియ్యరు—అడిగితే నాన బెడతరు. ఖరాఖండి[6] సేత్తె దేని మీన బెట్టో తంతరు పంచాతంటరు. దండుగ[7] లంటరు. మనుసుల్ని నమ్మే బదులు దున్నపోతుల నమ్మాలెహే....

మల్ల దొరోరు మతికచ్చిండు[8] ఆ సౌదరోని కుంటకింద పొలమిమ్మన కండ్లల్ల ఆత్తులేసుకొని పసి పోరగాండ్ల సాదినట్టు సాత్తె....నాత్రిగూడ లేపి

---

1. నీటిప్రవాహంవల్ల భూమిలోఏర్పడ్డ కోత 1a. మెట్ట 2. వాగుకు అడ్డంగా 3. విత్తుతాను 4. మాఘ మాసంలో 5. త్రవ్వుతాను 6. ఖచ్చితం 7. జుల్మానా (fine) 8. గుర్తుకు వచ్చారు.

చ్చిండు. అఖరుకత్తె ఏందో సేసిన్నని బిచ్చమెగబెట్టిండు— శలీరమంత అగ్గైమండి అమంట ఈమంట కచ్చులానికెదురు తిరుగుతె ఈ పంత[9] పలుగ్గొట్టిండు... దీనమ్మ— పెద్దమ్మ పూనినట్టు శలీరం ఊగింది... అని పాశేరోడు కొంగల పోశడు లేకుంటె పెయ్యంత[10] పికులగొట్టి దౌపతి బట్టలిడిసిన కీసకున్ని సంపి భీమన్న రకుతం తాగినట్టు తాగి— "బలోబల"ని మాదిగిండ్ల సుట్టు సల్లేటోన్ని.... అయినా అడు లేసినేల్ల మంచిది. పోనియ్యి లంజకొడుకులు ఈకాన్నుంచి నాకాళ్ళ జోలెందుకు?

కొంరని ఇసారం సెలుక దిక్కు పడ్డది.

"ఈ పరం పోగు దుంతె నరారి పంతులుగాడేమన్న అడ్డు పుల్లేత్తడా" కొంరని గుండె ఒత్తిపట్టిన బండోలె సదిరిపోయింది.... సెలక మజ్జెనున్న నల్లరేను సెట్టు కింద కూకున్నడు. సానసేపు పత్తాయించుకొని[11] లేసి నిలబడ్డడు. "పంతులుకేమన్న ఇత్తైఊకోడా! ఏమిత్తడు? తను మొన్నటి దండుక్కే గొడ్డునమ్మిండు. ఇగ అమ్మటానికి గుడుక[12] ఏం మిగులలే. మల్లి సేతుల ముంగటి కడాలున్నయి. అబ్బో! దానికి గొడ్డునమ్మిన కుమ్మరాం[13] మండినట్టు కుత కుత మంటుంది. అదో తీరుమనిషి! అందరివవుతు[14] అంగి తిర్గుమంటుంది. ఇప్పటికే గిట్లున్నది. అంగి తిరుగుతె గుర్రమెక్కురు?... పెండ్లాన్ని ఇంట్లకు తోలు మనరు?...దానికేం తెలుసు...కిట్టయ్యొచ్చిన ముప్పయన్నయిగద- పంతులు గాడింటడో? ఇనడో?" ఇట్ల ఇసారించుకుంట పంతులు పల్లె సేరుకున్నడు...

ఇంటి ముంగట కూరుకుతన్న[15] సుంకరి నర్సిమ్మడు కొంరన్నిసూసి "ఏందిర కొంర? ఏడికచ్చినవ్.?" మందలిచ్చిండు.

"సీయక్క! ఈల్లి కెంతమదము? ఈల్లేపంతులయినట్టు"— మనుసుల. "దొరకాడి కేరనర్సన్న ..." పైకి మర్యాద కన్పించేటట్టుగ అన్నడు కొంరడు.

"దొర అలిట్ట[16] తీస్కుంటండు..." నర్సిమ్మడు.

---

9. పీపంతా 10. శరీరం 11. విచారించుకొని 12. కూడా 13. కుమ్మరి వామి 14. వలె 15. కునికిపాట్లు పడుతున్న 16. అలసట

కొంరడుపాటకుల్ల[17] నుంచి లోపడికి తొంగి సూసిండు. నరారి పంతులు తట్టుకుర్సీల ఒరిగి కూకొని ఎడుమసేత్తోటి మీసం దిద్దుకుంట ఏపసెట్టు మీనిక సూత్తండు ... కుర్సి ముంగట బల్లమీద బంగారుఫేము కండ్లద్దాలు-దాని కానించి సిమ్మంమూతి పొన్నుకర్ర..

"అట్టిగెనె కూకున్నడు గదె?" కొంరడు బతిమిలాడిండు.

"గదె...నే ననేదేందనుకున్నావ్? అలిట్ట తీసుకుంటండు ..అయినా పంతులుతోటి అంత ఏగిర్తం[18] పనేందో?" నర్సిమ్మడు ముంగటికి వాలిన మీసాల సందుల్నించి హేళనగ నవ్విండు. భూమి లేనోడు పంతులు దగ్గరికెందు కొత్తడని సమజయ్యేటట్టు[19]

"ఏమిలేదురా?..." కొంరడు నసిగిండు.

"సల్లకచ్చి ముంత దాసినట్టుంది నీ ఎవారం.. నాతోని సెప్పరాదు.. నేను దొంకు సెప్పుతె అదో తీరుగుంటది..."నర్సిమ్మడు.

నిచ్చమే ననిపిచ్చింది కొంరనికి... గుడి సెట్టుకింద సెలుక గురించి సెప్ప కచ్చిండు.

అంత ఇన్నంక ఘొల్లున నవ్విండు.

"గంద్లేమి పండుతదిరా! రెక్కలకట్టము తప్ప-రకుతం కలి కలి సేసు కున్నా దాంట్ల ఇత్తనాలు మరిగినట్టయితె[20] నేను సెవ్వుతెగ్గోసుకుంట" నర్సి మ్మడు నిక్కచ్చిగా సెప్పిండు.

అయిన కొంరనికి ఆశపోలే. నువ్వయితె కాసంత నేనచ్చిన్నని సెప్పు పోరాదుర?" కొంరడు

"నాకే మిత్తవు?" నర్సిమ్మడు లేసి నిలబడుకుంట అన్నడు

"సేరు సారసీస-సెప్పుత" కొంరడు

"నీ ఇంట్ల కోడిపెట్టున్నదట? అదిగుడుక ఇయ్యాలె..." నర్సిమ్మడు.

---

17. గేటులో 18. వేగిరం 19. అర్థమయ్యేట్టుగ 20. మొలిచినట్లయితే

కొంరడు అయిట్టంగనే తలూపిండు.

నర్సిమ్మడు పాటకులు తీసుకొని లోపలికి బోయిండు. పంతులు ఏమి సెప్పిండో కొంరనికినబడలె... కాసేపటికి తిరిగచ్చిండు.

"దండాలు బాంచెన్..." నెత్తికి సుట్టుకున్న తుండుగుడ్డ తీసి ముఖం కాడ రెండు సేతులతోటి పెట్టుకొని అంగి మొక్కిండు.

నరారి మీసాలు దిద్దుకుంటనె "ఏందిర బొత్తకొంర... లంజకొడుక మొన్న నేనురాందే పంచాతి తెంపుకున్నవట? బలుపచ్చింది."

"నీ బాంచెన్... నీ కాలు మొకుత.. నేను కుప్పేసుకోలె-" అనిగి నట్టన్నడు మీదికి— లోపల కుతకుత మంటంది.

"సంగతేంది? .. అని దిక్కు సూడకుంటనే సాలసేపటికి...

"గదే బాంచెన్... గుడి మెట్టుకింద బాడువ..." నసిగిండు. కనుబొమలు మడిసి ఇసారించి-

"ఎంతిత్తవో సెప్పు..." కంఠంలో కాఠిన్యం.

"నీ బాంచెన్,.. సుంక లేవడ్తె కొర్జము కనిపిత్తది.." దీనంగ మల్లో సారి దండం బెట్టి అన్నడు.

"ఈడికెందుకచ్చినవ్? నర్సిమ్మ! ఈన్ని మెడలుబట్టి.." సగంల ఆపి పాటకులకెల్లి ఏలుపెట్టి సూపిండు.

కొంరని రకుతం ఏడెక్కుతంది.. మెడల్ పట్టినూకుతవ్‌రా! ఊరును గొట్టి ఇద్దరు పెండ్లాల్ని సేసుకొని, ఒకదాన్ని పట్నంలుంచిండు- అది కిరాయికి కొట్టిచ్చుకుంటంది- ఈని తాతసొమ్ము తింటన్నగద? ఈడు మెడలు బట్టి దొబ్బడుమరి?...

"నీ బాంచెన్... గట్లంటెట్ల..." మల్ల నటన మొదలుపెట్టిండు.

"మూఁరూపాలు... పట్టుకచ్చి మాట్లాడు .." నిక్కచ్చిగా- అనిమొకం తిప్పుకున్నడు,

కొంరని మనుసు దిమ్మెర పోయింది. అయిన ధైర్రెం తెచ్చుకొని "నీ బాంచెన్... దెబ్బయిత్త... ఏదో సూసుకోవాలె... నీకాలు మొకుత" గద్దెకు మొక్కిండు.

సానసేపు నరహరి మాట్లాడలే.

"ఇవలెల్లుండి తెచ్చిచ్చి దున్నుకో.... నీకెంద్రరా కొడుకులు?" నరారి.

"ముగ్గురు బాంచెన్... అంతాతుక్కే..." నరారి మాట సమజ్ సేసు కొని అన్నడు కొంరడు.

"అయితె ఓ పదిరోజులు కట్టెలుకొట్టిపో-" నరారి.

ఈయన సొమ్ము తింటన్నట్టు- దెబ్బయి రూపాలియ్యాలె- ఎట్టికి కట్టెలు గొట్టాలె: లోపల, "సరె బాంచెన్..." పైకి.

కడుపుల అకలి కరకరలాడ్తంటె పరంబోకు కోసరము- పొద్దుగూకె దనుక పొయ్యిల సెక్కలు నరికిండు కొంరడు-

ఎండకాలము గడిసిపోయెటాల్లకు పోరగాండ్లు, పెండ్లాం, తను కలిసి సెలుకల తంగెడుసెట్లు కొట్టి, మొట్లుతవ్వి, రాల్లేరి బంటాలుతీసి ఒర్రెకుఅడ్డం దట్టేసి దాన్కి భూమి అకారం కలిగిచ్చిండు. సెలక ఆకారానికచ్చింది. రకుతం సెలకంత నింపుతె..

# 5

బారుగాగు నుంచి మంచినీల్ల కడువ మోస్కచ్చి నిట్టాడుకాడ దించింది మల్లి...

"అవ్వ.. ఓ అవ్వ బువ్వే! నిన్నగుడుక ఉపాసమే ఉంచితివి. బొత్త సూడవ్వ... ఎడుమడికుక్క కడుపుల నొత్తంది..." సిన్న కొడుకు బానడు

ఏడుసుకుంట మల్లి ముంగటికచ్చి ఈడ్సకపోతన్న కడుపును చూయిచ్చిండు అకిట్ల నిలుసున్న రాజిగాడు దుర్గి ఆకలి సూపులు సూత్రరు.

మల్లి కడుపుల దేవినట్లయింది.. సుమ్మర్లు సుడుతంది మనుసు. కండ్ల నుంచి నీళ్ళు సతుక్క పోయిన[21] సెంపలమీన్నుంచి కారినయ్. బానన్ని ఎద కదుముకున్నది...

గుడిసెలకు బార సూసింది. రెండుమూడు కాలికుండలు, గడుక[22]పోసు కునేకుండ- మసి బట్టిన ఇంక రెండుమూడు సిన్న కుండలు కనిపించినయి...!

కట్టకాలములో గొడ్డుపాలు పిండిపోసేది.. దానికి గొడ్డు మతికచ్చింది. కాని అది గుడుక అమ్మిండు... గొడ్డు తోటట్టుగ తొంట కొంరని కొడుకు లింగడు కర్రెలింగడు మతికచ్చిరు.

"అగ్గెనగాల్ల మూడుగిద్దెల అడ్లు నలుభై రూపాలు దండుగ బెట్టిచ్చిరు" అనుకున్నది.

"అల్లి కడుపుల గాలకొడుకో! అల్లిండ్లు కూలగదలో కొడుకా—." ఏడ్సుకుంట పేరు పేరున తిట్టింది...

అంతట్లకే ఓ కర్రెకోడిపిల్ల గుడిసెలకు సొచ్చి పొయ్యిని తవ్వడం మొదలు పెట్టింది. ఆ కోడిపిల్ల తొంటెకొంరని కొడుకుది.

"ఉస్సో... నీ దినాలుగాను, నిన్నెత్తుకపోను, ఇంకేమిమిగిలిందని అచ్చినవ్-నీ యిల్లుగాల-నీ ఇంట్ల పిలువ పిల్లలేకుంట-మే అన మేక లేకుంట నాసిడమైపోను." అక్కసంత కోడిపిల్ల మీన బెట్టిలిట్టంగ అటుకెల్లి నీల్లి కడువెత్తుకొనిబోతన్న లింగం పెండ్లముపోసి ఈ మాటలిన్నది. కోడిపిల్లను తరుముకుంట ఈవలకచ్చిన మల్లిని సూసింది.

"లంజెలు కోడిపిల్లను సూసినా, మనుసుల సూసినా కండ్లల్ల కారము పోసుకుంటరు-తీట లమిడీలు[23]" ముఖం చిట్లిచ్చి కాలు నిలేసి నిలుసుండి అని "తూ.. లంజెకాన..." కాండ్రకిచ్చి ఊంచి గుడిసెకెల్లి నడిసింది.

---

21 పీక్కుపోయిన22 జొన్న అన్నం 28. తిట్టుమాట

అసలే మండిపోతన్న మల్లికి ఆ మాటలు అగ్గిమీనగుగ్గిల మయినయ్. . రెచ్చిపోయింది. మూన్నెల్లుగ దిగమింగు కుంటన్న దాని సౌద బయటపడ్డది.

సేతులార్సుకుంట బూతులు తిట్టుకుంట ఆకిలి[24] కొసదనుకచ్చింది. "తీటలంజె! నిన్నెవడు పిలిసిండె? కయ్యంబెట్టుకుంటవె? తూ(లంజె! బరితె గించినలంజె, బట్టులంజె . ." మల్లి.

పోసి జెప్పజెప్ప[25] గుడిసెల నీల్లకడువ దించి ఈతలకచ్చింది. ఏమన్న వె... నేను బట్టులంజెనా? బద్మాషిలంజె! తీటలేసి. . ." దాని ఆకిటకచ్చి కయ్యానికి కాలుదువ్వింది.

ద్దీ, అంటె ద్దీ అనుకున్నరు... ఇర్తి పెట్టుకొని నెత్తిమీనికి పొద్దచ్చేదనుక తిట్టుకున్నరు. మన్ను పోసుకున్నరు. గూడానికి గూడెం జగడంకాడికి సేరు కున్నరు. ముక్కు మీన ఏలేసుకొని అమ్మలక్కలు సోద్దెం సూత్తంటె మరింత రెచ్చిపోయి పోసి, మల్లి తిట్టుకున్నరు అన్నమాటనకుంట తిట్టుకొని, తిట్టుకొని ఇద్దరు అలిసిపోయిర్రు.

సివరికి ఎంటికలు బట్టి పూ. . . మీనదంతె గూదదిగాలె లంజెకాన! ఏమనుకున్నవా?" పోసి మల్లి దగ్గరికచ్చింది. . .

"ఏది తన్నె-తంతావే.." మల్లిపోసి ముంగటికెల్లింది.

పోసి పోశమ్మ పూనినవవుతుగనే మల్లి ఎంటికలందుకొని ఇగ్గి[26] ఒక్క తన్ను తన్నింది. . మల్లి ఈడుల పోసికంటె పెద్ద. . ముగ్గురు పోరగండ్లు. .. దానికితోడుగ బువ్వలేకపోవుటం, కింద కూలబడిపోయింది. . . పోసికి అయినా కోపం తగ్గలే. . ఎంటి కలందుకొని గౌరగౌర ఈడ్సింది. మోకాల్లు గీరుక పోయినయ్. . రకుతం కారుతున్నది . . .

రాజిగాడు ఇదంత సూసేటాల్లకు ఉగ్గమచ్చింది. సిన్నరాయందుకున్నడు. ఈడ్సి పోసి తలకాయ గ్గొట్టిండు. నొసలు పలిగి రక్తం సిమ్ముకచ్చింది.

గప్పుడు గూడెపోల్లు కదిలిర్రు ఇటుకొంత మంది అటుకొంత మంది సేరి ఇడిపిచ్చిర్రు.

---

24. వాకిలి 25. త్వరత్వరగా 26. లాగి

సేండ్లనుంచి అలిసిపోయి ఇంటికచ్చిన కొంరనికి ఈ కొట్లాటను సూసె టాల్లకు మతిపోయింది.. ఎటుతోసక మల్లిని రెట్టబట్టుకొని గొరగొర గుడిసెల కీడ్సుకపోయి కుదేసి రెండు తన్నులు తన్నిండు. మల్లి ఏడుసెటానికి గుదుక ఓపిక లేక మూల్గుతంది . ఆదెనుక ఆనికండ్లల్ల గబగుబ నీళ్లచ్చినయ్ ...

మాపటికి కులపోల్లంత పెద్దమ్మ గుడికాడ కుప్పయిర్రు. పంచాతి జరిగింది. .. మాదుగులంతా "దెస్సె అంటె, దెస్సె" అని. .. తప్పంత దెబ్బలు బడ్డ మల్లిదే సేసిర్రు. దానికి దండుగ యాభై రూపాలు.. ఆ రూపాలు పట్టుకపోయి లక్కెపురం తాల్లల్ల పోద్దాడు[27] కల్లుతాగాలె.. ఇది పెద్దమనుసులు నిర్నాయం సేసిర్రు.

పంచాత్ జరిగే టప్పుడు మూలకు గద్దెమీన ఓకాలు ముడుసుకొని మోకాలు మీన గద్దువ ఆనిచ్చుకొని పుల్లతో దుబ్బల పిచ్చిగీతలు గీసుకుంట కూకున్నడు కొంరడు

తీరుపు ఇన్న మోలె[28] దిగ్గునలేసి నిలబడ్డడు. ఆనికల్లు సింతనిప్పుల తీరుగ మెరుత్తన్నయ్.. మోకాల్ల దనుక రెట్టలు[29] గల కొంరడు రెండు గజాలమీన ఎత్తున్న కొంరడు- కారునలుపు శరీరం గల్లకొంరడు-లేసినిలబడితె- అందరికి భయం పుట్టుకచ్చింది. కొంరడు నిలువెల్ల వనికిపోతన్నడు.

లేసి పెద్దమ్మగుడి ముంగటి మట్టి తీస్కొని సేతులపట్టి నెత్తిమీదికెత్తు కొని.. "పెద్దమ్మ సాచ్చిగ చెప్పుతన్న. నేను ఇప్పుడు ఈ దండుగ నాపానం బోయినా కట్టనురాడి. ." మట్టి కింద పారబోసిండు.

మాదిగోల్లల్ల కలకలం.. "కొంరడు పమాణం సేసే." పెద్దిగాడు మెల్లగ అన్నడు ." అగ్గిసీల్లు బందు."

"అది నాకు తెలుసుర్రా. కుక్క బెదిరిచ్చి సెప్పెత్తుక పోయిందట.. అగ్గిసీల్లు బందయితయిర.. బందుసేసుకోర్రి. కులంలనుంచి పీకేయిర్రి. ముర్రిగిపోయిన గొడ్లనుతిని, .. సచ్చిన గొడ్ల తోళ్లెకెల్లి ఈడ్సేసి కాపోల్లయి, పెర్కోల్లయి, దొరోల్లయి ఎందరియేంది? సంబంద వర్నాని[30] కాళ్ల మొక్కు-

27 మగ చెట్టు 28 వినగానె 29 చేతులు 30 మొత్తం కులాల

ఉంట కుక్క బతుకు బతుకనుర - ఈ కాన్నుంచి అట్ల బతుకనుర నాకియ్యాటి నుంచి కులంలేదు మాట మాటకు బెదిరిచ్చే ఈ కుల్లిపోయిన ఈ కులం నాకసలే అద్దు.. మీరుగీ కులానికేన బెదిరిచ్చేటిది? .. గంతేగద- ఇంకేంసేసుకుంటరో సేసుకొండి. ఓ కులపెద్దల్లాలా! మీ కందరికి నాదండాలు..', సేతులు జోడిచ్చి "ఈ నరుకం నుంచి బయటికెల్లిపోత . మీక్కన్పించకుంట పోత.. మీరంత ఈ కులం మజ్జెన్నే ఈ సచ్చిన బక్కగొడ్ల మజ్జెన్నే. ఈ గవుల కొట్టె మాంసము మజ్జెన్నే-పీతిరిగద్దల మజ్జెన్నే సుఖంగ బతుకుర్రి.. ఎల్లకాలము సేమంగ బతుకురి9.. దొరోరు సెర్మము ఒలుసేసినా బాంచెన్ బాంచెనను కుంట బతుకురి9, నర్సయ్యా, పోశాలు, కట్టయ్య చెప్పులు వట్టి ఈపులు సిట్లకొట్టినా ఇక్కన్నే బతుకురి9. ఇట్లనేబతుకుర్రి'మల్లి కెల్లి దిరిగిండు.'' మల్లిరాయె ఎల్లిపోదాం. ఈళ్లే గూడాన్ని గుత్తగ్గొన్నరు. ఈ కులాన్ని ఈల్ల తాతలముత్తాల కాన్నుంచి ఈల్లె గుత్తగ్గొన్నరు. ఈ కుల్లిపోయిన పురుగులబడ్డ కులము, గూడెం మనకద్దు" మల్లిని రెట్ట పట్టుకొని గుడిసెల కిగ్గుకపోయిండు.

మాదిగోల్లంత అంతసేపటి కాన్నుంచి థీరిపోయిరు9. కొంరడుపోయి నంక "బలుపు" అని ఒకడు- ''కావురం" అని ఇంకొకడు .. 'కులంలనుంచి తీసేయంది కలువది' అని ఇంకొకడు .. ''డక్కలోల్లండ్ల[31] కలుత్తడని" ఇంకొకడు నానారకాలుగ ఎవరిట్ల మచ్చినట్టుగ ఆల్లు కొంరన్ని తిట్టిరు9.

''ఎవని ఖర్మము ఆడేగుడుత్తడు ..'' మీదికని. పెద్దిగాడు కొంరడు పోతే ఎదుఋండదని లోపల సంబరపడుకుంట లేసిపోయిండు.

గూడానికి ఆని మాటలు మొత్తంమీన కొరుకుడుపడలే...

కొంరడు తెల్లారి గుడిసిచ్చుకొని. బోడిబొక్క పోతుల బండిమీన పెట్టుకొని, ముగ్గురి పోరగాండ్ల పెండ్లాముతోటట్టుగ గుడిమెట్టుకింది పరంపోగు సెలుకలకు తరిలిపోయిండు.

''గు.. మీన తన్ని ఎవరో ఆయింత భూమి గుంజుకుంటరు..'' మాది గోల్లంత అనుకున్నరు..

---

31 (మాదిగ వారికంటె తక్కువగా చూడబడే) నిమ్న జాతిలో

సెలుక మూలకు కొంరడు గుడిసేసుకున్నడు.

*          *          *          *

"లింగా!" పుట్ట గడ్డమీన నిలుసుండి ఎనకకు సూడకుంటనె పిలిసిండు పెద్దార వెంకటరెడ్డి.

"ఏందురిఁ బాంచెన్...?" కంచె సూపిత్తన్న కంచెకావలి లింగడు పక్క గోలుగ నిలుసున్నడు.

"బొత్త కొంరడు మాదిగిండ్లల్ల నుంచి ఎల్లిపోయిండట కదర-?" బట్టతల మీన ఎండ సురుక్కు మంటే సేతపునుక్కొంట అన్నడు.

"ఔనురిఁ బాంచెన్. రకుతమురిఁ. రకుతం బాంచెన్" అడు అడివికెల్లి సూసుకుంట అన్నడు.

దొరోరికి మాటలు సమజ్ గాలే-

"రకుత మేంది బంచెత్.." అడుగు ముంగటికేసి సేతులున్న పొన్న కట్టెను గాలిల ఆడిచ్చుకుంట...

'గదేనురిఁ..నెత్తురు.. ఆనాడు మీ కెదురుగచ్చిండా.. నిన్న కులపోల్ల మీనికి మరిఁబడ్డడా? అదంత నెత్తురు బలిమికాకుంటేంది బాంచెన్..?" లింగడు.

"ధుత్తెరి. లంజకొడుక! ఊకుండు." ఓ దిక్కు బట్ట తలమీన ఎండ ఇటు ఎదురుగచ్చిండని కసిరిండు.

లింగని ముఖం సమురు లేని దీపమోలె ముడుసుకున్నది. ఇగ అడు పెమవు ఇప్పలే..

కాసేపయినంక 'మరై తె ఎటుపోయిండాడు?" మూలమలుపు తిరిగినంక దొర మల్లఅడిగిండు గ్యాపుకమచ్చి.

"గీన్నే బాంచెన్. పంతులోరు పరంపోగు చూయిచ్చిరుఁ: గుడిసేసుకున్నడు." అడివికెల్లి ఏలుపెట్టి చూయించిండు.

"ఇన్ని రోజులు నాకు సెప్పలే-మనకంచె బందుకు[32] గుడిసేసుకొని

32 పక్కకు

ఎవ్వారం సేత్తంటె సూసుకుంట ఊకున్నవ? పోదాం పా! తోలు ఒలుత్త! మీసం మీన సెయ్యేసి అడుగేసిండు.

"అడివిల ఏమున్నది బాంచెన్ అది ఆనికి దేవుడిచ్చిన శిచ్ఛ ఆరుగాలము కట్ట బడ్డా ఇత్తుపండదు. బలుపంగుతది." సిన్నంగ నవ్వెండు లింగడు,

దొరోరు సానసేపటిదనుక మాట్లాడకుంట గునాయించుకున్నరు ఇగ ఇంటికి బోయెదనుక ఎవ్వలతోటి మాట్లాడలె.

తెల్లారి మాదుగులందరిని పిలిపిచ్చిండు.

"పెద్దిగ!.. నిన్న లింగడు సెప్పుకచ్చిండు: కొంరడు మాదిగిండ్లల్ల నుంచి ఎల్లిపోయిండట నిజమేన.?" పెద్దిగానికెల్లి సూసుకుంట.

"ఔనురి." సేతుల పిసుక్కుంట అన్నడు పెద్దిగాడు.

"జెట్టమ్మ ఊళ్లెనుంచి ఎల్లిపోయింది. సరెగాని పెద్దులు నా కాని మీన్నే కోపంగని మీ మీనెక్కడిదిర? ముంగటి నుంచి సీరటి బిచ్చంపెడ్త.." ముసి ముసి నవ్వుకుంట అన్నడు.

ముంగట్కి పెశతనన్న బిచ్చానికి మాదుగులంత తబ్బిబ్బయి పోయిర్రి దొరోడు సాచ్చాత్తుగ మాల్లెకిట్టడు సెప్పిన దానకర్నుని వవుతుగ, సింది మాదిగి సాయి మల్లడేసిన సచ్చరి సంద్రుడిగ కనిపించిండు.

"సీ బాంచెన్.. గరీబోల్ల కడుపుల మీన కొడితె మీకేమత్తది? పుర్రె సేయి[33] దులుపాలె బాంచెన్.. మీ ఆసోంటి పెద్దలోకులు లేకుంటె మాసోంటి గరీబోల్లెట్ల బతుకుతారు? బాంచెన్.." ఇట్లపొగిడిర్రి.

దొరోరు కొంరన్ని ఇట్టమచ్చినట్టు తిట్టిండు. అటెనక సెప్పకుంటనె ఇంట్ల కెల్లపోయిండు.

మాదిగోల్లంత సంబరంతోటి గూడానికి మరలిర్రి..

"గాపోల్ల బుద్దులు గుడుక గొప్పగుంటయిర్రి.. కొంచెగాని[34]కె ఏగిరితం..[35]." పెద్దిగాడు ఊసిపోయిన పేలుక గుండుకు సుట్టుకుంట అన్నడు.

33 ఎడమచేయి 34 అల్పునికే 35 వేగిరం

అందరు "నిచ్చమే" నన్నట్టుగ తలలూపిరు.

# 6

రెండేండ్లు గడిసిపోయినయ్.

ఈ రెండేండ్లల్ల ఈ దేశంల గరీబోల్లు ఎన్నితీర్ల కడుపు తిప్పల్లు పడుతన్నరో? ఉన్నోల్లి కాల్లకింద గడ్డిపూల వఖ్తుగ[36] నలిగిపోయిన మానాలు, నల్ల సీమలవవుతుగ నలిగిపోతున్న పాణాలెన్నో? తరతరాలుగ కూడు కోసరం తన్నుకొని సచ్చినోళ్లు, గుల్లకోసరం, రాజ్యాల కోసరం కొట్టుక సచ్చినోల్లు ఎంత మందో? సచ్చినోల్లమీన కథలురాసిరు. కావ్యాలు రాసిరు.... బిరుదులు తీసుకున్నరు... రాణిగారి కాలుగోరి సింగారం వర్నించి గండపెండేరాలు తీస్కున్నరు. రాణిగారు సిలుకకు రోగమత్తే కవులు ఏడిసిర్రు... కాని పేదోల్లి బతుకుల గురించి పట్టిచ్చుకున్నోడు లేడు.... పట్టు పరుపుల మీన పండుకొని టూగుటుయ్యాలల్ల వూగిపోక సెక్కలేసుకొని పల్లెలపారే అగునుషూసి ఆహా అన్నారు...

ఇట్ల రాసుకుంట పోతంటె దీన్కి అంతంలేదు.... కథకంచికి తీర్థయాత్రలకు పోతది... నేను అల్లల్లకే పోత....

కొంరని బతుకు గుడుకసాన మారిపోయింది.... రకుతాన్ని, మాంసాన్ని మన్నులో కలిపిండు.... కని ఆనికి దొరికింది కడుపుమంట— దరిద్రం.... అట్లయిన ఆనికండ్లల్ల బతుకు కోసరము పోరాడాలె అన్న ఆశ మాత్రం దీపమోలె ఎలుగుతనే ఉన్నది.

మల్లి ముఖంల మాత్రము కొట్లాడి కొట్లాడి అలసిపోయిన సీడ కన్పిత్తది. దానిముఖంల ఎన్నికట్టలు బడ్డదో? అన్ని ముడుత లేర్పడ్డయి. రాజిగాడు కొంరని చేతి కందిండు.

---

36 వలె

''వన మిడిసిన కోతి ఊరిడిసిన మనిసి ఒక్కటే'' అన్న దొరోళ్ళు, వనమిడిసిన కోతి మనుసుల్లకచ్చి నరకం సూత్తది. కాని కులమిడిసిన కొంరడు వనం ఐడితె సర్గంకన్పడ్డది.

దొరల లెఖ్క[37] జంతువులు బాదపెట్టలే... సగం సగం కొరుక్క తినే దొరోరికంటె ఒక్కసారె గొంతుక కొరికే పెద్దపులే నయం... అందుకో సరమే జంతువుల కంటె క్రూరమైనోల్లు దొరలు,

మాదుగులంత కొంరని తిక్క కుదురుద్దనుకున్నరు. కాని మాదిగోల్ల తిక్కే కుదురలే కులంలేకుంట ఆడెట బతుకుతున్నడొ గూడానికి సమజ్ గాలె. ''దుట్టున్ని జూసి దేవుడు గుడుక దూరముంటడు - మన మోలెక్క'' అనుకున్నరు గొడ్డును కోసుక్కనేకాడ

కొంరడు సెంకల రాయిరప్పలేకుంట జేసి అంపులు మిట్టలు సమానం సేసిండు దప్పనం దిక్కు బాయి తోడిండు.

మాగి కాలంల మూడెకురాల మక్క జొన్న పెట్టిండు, ఆని కట్టను కొద్ది కర్రలు మొట్లకు మొట్లూరి ఝాడిచ్చి కర్రకు రెండు కంకులు పెట్టినయ్ కనుక పెను వవులగ పెరడి ఊగుతంది.

ఏగిలి వారుతంది.[38] గుట్టసుట్టూరుత నాత్రేసిన మనసు[39] పంజరాన్ని నరకటానికి తూరుపునుంచి సూరుని కాంతి కత్తులు కటారు లిసురుకుంట, బాణాలు కొట్టుకుంట బండిగీరె వవుసుగ దూసుకవత్తంది.

కొంరడు మోట కొడుతండు దున్నపోతుల ఆదిలించుకుంట. రాజిగాడు నీల్లు కడ తండు. మల్లి కుండలు కడుక్కుంటంది.

''అబ్బ! ఇయ్యేడు నా కట్టము భూదేవర సూసింది_నెనరు [40]పుట్టింది. ఈయేటి పంట రెండుపుట్లయితే పోతుల నమ్మి కోల్లాగెల తీసుకోవాలె- గుడిసె గట్టిగసేసుకని గూనేసు కోవాలె.' కొంరని మనుసుల ఆలోచనలు ఈ తీరుగ నడుత్తున్నయి.

---

37 తెల్లవారుతున్నది 38 మంచు 39 ప్రేమ 40 అసూయ

మోటగిరె "కి్రు కి్రు" మని రాగం తీత్తంది. అడివిల సీతువ పలుకుతాంది, మల్లి కసికెతోటి గుడిసెకాడ గటుక్కుండ గీకుతుంది. మోటబొక్కెన జల జల నీల్లుపోత్తన్న సప్పుడు. ఇవ్వటిని సూసెటాల్లకు కొంరడు తనకు తాను మరిచిపోయి కూనిరాగ మందుకున్నడు.

"వాడ కదిలిందిరా! జంబాయిరే!

బెజ్జువాడ కదిలిందిరా జంబాయిరే!"

"మామ! అంత మంచేనాయె." దొరోరి పాలేరు అంకడు ఎడ్ల మోప టానికచ్చి కొంరని బాయికాడి కచ్చిండు.

కొంరడు పాటను జల్ది ఆపిండు. అంకని కెల్లి సూసిండు. కొంరని మనుసుల ఇప్పుడు ఈసు[41], పగలకు తావులేదు.

"మంచేన్‌రా అల్లుడా! గూడమంత బాగున్నర?" కొంరడు.

"ఆ! గూడెం సంగతి నీకు తెలువద? మావ!" పెదవి ఇరుసుకుంట అన్నడు అంకడు.

కొంరడు కాసంత సేపు మాట్లాడలే. అటెనుక దండెడ ఇగ్గుకుంట[42] "ఏదోర అల్లుడా! దొరల కిందనుంచి బయటికత్తెనే బతుకురా-" కొంరనిమాట నీల్లసప్పుల్ల కలసిపోయింది.

అంకడు పెరటి కెల్లి సూసిండు. కండ్లు చిరుతలు కమ్మినయ్. "భూదేవర నిన్ను ఇయ్యేడు ఎత్తుకున్నది. మావ. మనిషిని నమ్మితె సెప్పు[43]దెబ్బలు. అంగుతె[44]ఎక్కుతడు-కూకుంటె తొక్కుతడు నిలబడితె మొక్కుతడు. ఏం మనుసులో ఏమొ!" అంకడు పండ్లపుల్ల ఇసిరేసి మొఖం కడుకోను దోని[45] కాడికి నడిసిండు.

"అవ్వల్దర్జగ[46] సెప్పినవ్‌రాఅల్లుడా!" గట్టిగ నవ్వుకుంట అన్నడు ఆని ఛాతి ఎగిరెగిరి పడ్డది.

---

41 ఈర్షన 42 మోటతాడు లాగుతూ 43 చెప్పు 44 వంగుతే 45 నీటి ప్రవాహం కోసం ఉన్న ఏర్పాటు (ఉదా: తాటి దోని) 46 చాలా బాగా

"ఈ సంగతి యిన్నవానె?- మావాః (మాదిగి) కొండన్ని కచ్చులం దొరగీలె[47]పడ్డందుకు అరుగట్టిరిగెవనుక కొట్టిండు దొర. ఆని శరీరమంత రకుతంతోని గూడెంల కొస్తె అడిగే దిక్కులేదు. పదిరోజుల కిందట దొరోరి[48] కొడారికాడికి పైడిగానికి సద్ది కొంటబోయిన పైడిగాని పెండ్లాం రాయపోసిని బలిమిటికి[49]కచ్చీరింట్లకు ఈడిసి సెడగొట్టిండు దొర. పొద్దుగాల్ల అది బాయిలో పడి చచ్చింది. గూడెం అంతా గుబ గుబ లాడ్తంది. అయినా ఎవలూ బయట పడలే. ఏందో.... అంతా....!"

కొంరడు యింటున్నడు.

మల్లి నీల్లకడవ పట్టుకొని మోటకాడికచ్చి అంకని సూసింది. "అంకన్న బాగున్నవః" అడిగింది పేమగ.

"బాగనే ఉన్ననత్త" నీల్లు పుక్కిలించి ఊంచి అన్నడు.

అమాట ఈమాట మాట్లాడి అంకడు ఎడ్లకాడికి పోయిండు... కొంరని పెరడి సంగతి పాలేరోల్లందరికి సెప్పిండు సంబర బడుకుంట. . గూని సమ్మనికి కడుపుబ్బింది...

వరి బంతి కొట్టంగ దొరోరి సెవులేసిండు... దొరోరు ఉలిక్కిపడి మల్ల అడిగిండు- బంతికాడ చిః దొరనుంచి[50] అదేకాల్లమీన కంచె కాడికచ్చిండు దూరంగ నిలుసుండి కొంరని పెరట్నసూసిండు... కండ్లల్ల అగ్గి కురిసి నట్ట యింది. . ఎడమ మీసం మీన సెయ్యేసిండు.. ఎనుకకు మర్రి ఇంటి కచ్చిండు.

మూడు రోజుల దనుక పొద్దాటి కల్లు సయిసారము లేకుంటయిపోయింది.

"లంజెకొడుకు- పంతులు నరారి గాడెంత పన్జేసిండుః" పొగాకు నుట్ట తాక్కుంట నరారి పంతులను పెండ్లమాలు తిట్టిండు.

అయిన! తొవ్వ దొరకలె- సమఃజ్‌గాలె- నరారి పంతులుకు దొరోరికి ఒకల కాలుసెప్పు ఒకలకు పడదు... పరంబోకులకాడ పంచాతచ్చింది.. బాగా ఇసారిచ్చుకున్నడు.

---

47 కాడిపైకి లేచునట్లు బండిపడుట 48 దొరవారి 49 బలవంతాన
50 చిన్న దొరను ఉంచి 51 రుచి

అర్జునునికి కిట్టమూర్తి గాపుకు అచ్చినట్టు నర్సిమ్మ రెడ్డిబావ గాపుకమచ్చింది. "దీనితల్లె.... ఇన్ని రోజులు బావ ఉన్నాడనుకోలే- "పొన్నుకర్ర ఊపుకుంట అనుకున్నడు.

సాకలి రాయనర్సన్ని జరూరుగ [52] పిలిపిచ్చింది.

"పిలిపిచ్చిర్రట? బాంచెన్..." దండం బెట్టిండు దూరంగ ఆగి-

"ఇగో- ఊరికి బోవాలె.... సిన్నకచ్చులం గట్టు...." హుకుం జారీచేసిండు.

"నీ బాంచెన్ దొర! మా ఆగి ఆపతి[53] పడ్తంది- ఇంట్ల నేను తప్ప మొగోల్లు లేరు. మంత్రసాని ముసల్దాన్ని తీస్కరావాలె బాంచెన్.... నీకాల్ మొకుత బాంచెన్..." భయపడుకుంట బతిలాడింది.

"మాదర్‌సోత్[54]...బడువ లంజకొడక నాకె పయినం బడితె అంకలు[54a] సెప్పుతవ? ఇయ్యాల్ల పెండ్లం నీల్లాడ్తది. రేపు అవ్వ సత్తది...."పొన్నుకర్రగాలిల ఊపిండు.

రాయనర్సడు గుడ్ల నీల్లు గుడ్లల్ల కుక్కుకున్నడు. బండికట్టి ఒరుగుడు మెత్తాలు పెట్టిండు.... ఎడ్లకు గజ్జె పేరేసిండు. దొర బండిలో కూకొని ఆరుగట్టె గాలిల "చెల్" మనిపిచ్చింది. బండికదిలింది.

బండిగిరెలు గిరగిరమని రాయనర్సని గుండెమీన తిర్గినయ్. బువ్వ తినకుంటనె రాయనర్సడు బండి ముంగిట ఉరుకుతండు.

బండి ఉరుకుతంది. బలిసిన కోల్లాగెలు, దొరోరి ముల్లు కట్టె ముడ్డి మీనదిగుతంటె రేసానికచ్చి[55] ఉరుకుతన్నయి....

"ఇంట్ల ఆగి మూలుగుతంది కావచ్చు- పోరగండ్లు సుట్టూరుత సేరకొని ఏడుత్తరు కావచ్చు. ముసలి అవ్వ దగ్గుకుంట మంచము కాడపునుకుతంది కావచ్చు... ఆగి...ఆగి....నొప్పులతోటి మలుకలుతిర్గి పోతన్న ఆగి....

---

52 అర్జెంటుగ 53 పురిటి నొప్పులు 54 (తిట్టు మాట) 54a. సాకులు 55 కోపానికి వచ్చి

''ఏడికి పోతన్నవ్...'' ఆగి ''దొర జరూరగ పిలిపిత్తండుపల్లె మీనికి పోయత్త
'జెప్పనరా! నీ బాంచెన్.... నేను బతుకుతనో బతకనో? మూడు కాన్పులకు
గుడుక ఇంత గనం నొప్పులురాలే'' ''గట్లనెకె కడుపుల దేవినట్టయితది'' ఆగి
ఏడుస్తుంది ''ఓరి నర్సవ్వా! జెప్పనరారా!'' ముసల్ది ''ఆగి-ఆగి..'' రాయనర్సడు
ఉరుకుతండు. అని మనుసుల గుడుక ఆలోచనలు ఉరుకుతన్నయ్. గజ్జె
పేరుమోత- బండిగీరెల సప్పుడు- ఇన్పించుడులేదు. కని ఆనికి ఆగిమూలుగు
మాత్రం ఇనబడ్తంది.

దొరోరు కయిలకోడె ముడ్డిమీన ముల్లుగట్టె గట్టిగ కుచ్చిండు. కయిలి
కోడె ఆ కోపముల రాయనర్సన్ని గూటించి. రాయనర్సడు బొక్కబొర్ల
పడ్డడు... కోల్లాగె తొక్కింది. సదురుకునేటాల్లకే ఎడుమ సేయి బండిగీరె
కింద నలిగింది....

గప్పుడే ఊల్లెకిఆగికిపిండం సచ్చి ఎదురుతిరిగింది.... దిక్కులేక ....
మూలిగి మూలిగి ఆగి మూలుగుడు ఆగిపోయింది. పోరగాండ్లు ముసల్ది ఘొల్లు
మన్నరు.

దొరోరు ఎనుకకు సూసిండ్రు. మతిబోయింది.... రకుతం బట్టలల్ల
ఉన్న నర్సిగాన్ని బండిమీనేసుకొని బండెక్కిండు...

బావోరి ఊరు సేరుకున్నడు.

బావ లక్ష్మారెడ్డి ఎంకటరెడ్డి పోయెతాల్లకు పరేషాన్[56]ల పట్టెమంచ
మీన పండుకున్నడు.

''ఏంబావ! ఎప్పుడురాక?'' నర్సిమ్మరెడ్డి.

''ఇప్పుడే వత్తున్నానోయ్- అన్నీ అపశకునాలె'' ఎంకటరెడ్డి.

''శకునాల] సంగ తటుంచు తవ:రుఏల్లగానేల్ల ఇంత జరూరుగ సుక్క
తెగి పడ్డట్టచ్చిరేం?'' లక్ష్మారెడ్డి

''ఏమిలేదు బావ!'' ఎంకటరెడ్డి మంచమీనకూకుండి.

''చెప్పుబావా'' లక్ష్మారెడ్డి ఇప్పసార అందిచ్చుకుంట.

---

56 ఆందోళనలో

''బాపూ... " పదారేళ్ల పడుసుపిల్ల ఆడికచ్చింది....

ఎంకటరెడ్డి పెదువులు తడిసేసుకున్నడు పడుసుపిల్ల సనుకట్టు కెల్లి సూసుకుంట- ఇప్పసార గొంతుల మండుతంది... లక్ష్మారెడ్డి ఎంకటరెడ్డిని సూసిండు

'ముసలోడైనా పాడుబుద్ధి పోనిచ్చుకోలే' లోపల."కృష్ణా! లోపటికి పోవే..."మీదికన్నడు లక్ష్మారెడ్డి.

కనుబొమ్మలు ముడుసుకొని వెనుకకుదిరిగింది... ఎంకటరెడ్డి ఆపిల్ల ఎనుక పొడుగాటిజడ- లయగ కదుల్తన్న పి...లు సూత్తండు....

''చెప్పవోయ్...'' విసుగ్గ అన్నడు లక్ష్మారెడ్డి.

"ఆఁ...అన్నట్టు- ఏమిలేదులే- మాదిగో డొకడు ఎదురుదిరిగిండు నా కంచె దాపుల పెరడు చేస్కున్నడు." ఎంకటరెడ్డి.

''సేసుకుంటె నీ కొంపేం మునిగిందోయ్-''లక్ష్మారెడ్డి

''అదిగాదోయ్ బావా! అది ఫసలుకు మర్రింది. ఆరెకరాలు- పరంపోగే ననుకో- నా కంచె నంబరు కిందున్నది...." ఎంకటరెడ్డి.

''అదా కత-? నరారి మొఖాన ఏమన్న పారేయకపోయినవ.''లక్ష్మారెడ్డి పావుమీనపావు ఇప్పసారా ఎక్కిత్తండు.

''కృష్ణా!.... అమ్మను నల్ల[57] పంపుమను.... పోరదేడబోయిండు?'' ఇంట్లకుకేకేసిండు....

పోరడు నల్ల పట్కచ్చి మంచం కాడిబల్లమీన పెట్టి పోయిండు. ఇద్దరు తింటన్నరు....

"పారేత్తననుకో... ఆపారేసేదేదో? నువ్వు పారేత్తే మంచిగుంటదని. ఆనికినాకు...'' మజ్జెలోనే ఆపి నల్ల నోట్లేసుకున్నడు.

---

57 గడ్డకట్టిన రక్తాన్ని వేడిచేయగా ఏర్పడేది

సరే! సూత్తాముగని.... ఇప్పుడునేను బడేపరిషాన్ల ఉన్ననోయ్-ఎలుకం పెల్లి రామిరెడ్డిగాడు ఆడ్డం తగిల్ండు. సడుగుగుత్త పట్టినసంగతి నీ కెరుకె గద? సడుగు మిరుపతోటల్నుంచిపోతందని కాసంతఅంకరతిప్పిఅని సేండ్ల నుంచి ఏపిచ్చిన... ఆడుపోయి హైకోరుట్ల నుంచి స్టే పట్టుకచ్చిండు. ఎవ్వారం ఇంత దనుకచ్చిందని నాత్రికినాత్రేఆనిఏటి కరంటుమోటరుపీకిచ్చిన- ఆడు కేసు పెట్టిండు. నాకురేగిందన్కో.... నిన్న మొన్న కండ్లు తెరిసిన రాంరెడ్డిగాడునాకు ఎదురు తిర్గుతడ? నర్సిమ్మరెడ్డి పేరుసెప్పితె పసిపోరగండ్లు పాలు దాగక పోవాలె...నాకాందాని... ఆ లుచ్చే[58] రాంరెడ్డిగాడెదురు తిర్గడమా! నాత్రికి నాత్రే, నామనుసుల్నిపంపించి పెండ్లాన్ని, బిడ్డను ఖరాబు సేయించిన, రామిరెడ్డిగాణ్ని బొక్కలిరుగ తన్నిచ్చిన-అంతదనుకమంచిగనే సాగింది.

కని అచ్చిన సిక్కల్లు ఎందో తెలిసిందా? అని పాలేరోన్ని మొన్న సెర్మము ఒలిసింటి- ఆనితోటి కేసు పెట్టిచ్చిండు-ఆనికి దమ్ములేక. డి. యస్ పి. అచ్చిండు. నలుభై వేలిచ్చిన-పాలేరోన్ని సితుక తన్నిచ్చిన.

కని రాజ్జెం బాగలేదోయ్. ఆడు హైకోరుట్ల పెట్టిండు, ఇస్పెసెల్ పోలీ సొచ్చింది. నా పాలరోల్లను యాభైమందిని జైల్లేసింది. నాలుగులచ్చలూడినయ్.'' గుక్క తిప్పుకోకుంట సెప్పిండు లష్మారెడ్డి.

నాలుగు లచ్చెలనేసరికి వెంకటరెడ్డి మతిపోయింది. కాసింతసేపు మాట్లాడలే.

"గదేమయితదిగని....'' పావు గొంతులపోసి గుటకమింగిండు.

ఇప్పుడేందోయి ఏగిరం....? పంటకు రానియ్యరాదు-పాలేరోల్లతోని కోయిత్తాము....'' లష్మారెడ్డి పొగాకు సుట్ట మొదలుకటుక్కున కొరికి అగ్గి పుల్లగీకి ముట్టిచ్చి గుప్పున పొగ ఇడిసిండు-ఇప్పసార నిషా బాగా ఎక్కింది.... కండ్లుబాగా ఎరుపెక్కినయ్.

''సల్లటిమాట సెప్పినవోయ్. ఇకనేన్ బోత....'' ఎంకటరెడ్డి మాట తడబడ్తంది... లేసినిలబడ్డడు.

---

58 నీచుడు (తిట్టు)

''అప్పుడే ఏం మునిగి పోయిందోయ్.... కూకో...'' రెండు మూడు రోజులుండిపోదువుగని'' లక్ష్మారెడ్డి కండ్లు మూతలు పడ్తన్నయ్.

''సాకలోడు గీరె కిందపడ్డడు. జెట్టలంజకొడుకు. ఆని 'పెండ్లాం...' సెయ్యిరిగింది...'' అడుగేసిండు...

బండి కట్టే సిద్దంగ ఉన్నది... బండెక్కిండు. సాకలోడు బాధతోటి మూలిగిండు...

* * *

మల్లో రెన్నెల్లు గడిసినయ్. ఓనాడు లక్ష్మారెడ్డి, ఎంకటిరెడ్డి నరారి పంతులింటికి అచ్చిరు[59]

లక్ష్మారెడ్డిని సూసెటాల్లకె కురిసిల్నుంచి డిగ్గునలేసి ఎదురచ్చిండు నరారి. నరారిపంతులు....కుల సేనా?'' లక్ష్మారెడ్డి సుట్ట కింద పారేసి సెప్పుకాలు తోటి రాసుకుంట అన్నడు.

"ఏదో తమరి దయవల్ల" నరారి తెచ్చిపెట్టుకున్న భకితితోటి. ముగ్గురు కురుసీలల్ల కూకున్నరు. లోపల్నుంచి చాయ్ అచ్చింది.

''నరారి...గుడిమెట్టు కింద పరంపోగు కొంరని పేరు మీన రాసినవట.' మా బావ కంచె అక్కన్నేగద? బావ సెవుల కాసంత ఏత్తె నీ ముల్లేం పోయింది''? వోరగసూసుకుంట.

నరారి మాట్లాడలే.

"సూడు నరారి మా బావ ఎడ్లకు తిప్పలైతంది. ఆ పరంపోగు." నర్సిమ్మరెడ్డి పొగాకు సుట్ట కొత్తది తీసి కటుక్కున కొరికిండు.

''అదెట్ల సాజ్జెం? దొరగారు!'' నరారి నసిగిండు.

''ఘటికుడివేనోయ్. నీకు సాజ్జం కాదా? బలే వానివోయ్! మొత్తం మీన కర్నపుబుద్ధి పోనిచ్చుకోలే.'' ఘొల్లున నవ్విండు.

---

59 వచ్చారు

నరారి కిందికి తల ఆల్సుకొని తల గోకిండు:

"గదీ సంగతిని సూటిగ సెప్పరాదోయ్.?'' అగ్గిపుల్ల గీసిండు.

"ఏదో మీదయ.'' నరారి.

"నాన్చకోయ్. నా సంగతి నీకు తెల్సుగద పదిహేను నూర్లు" సుట్టపొగ ఊదిండు.

నరారి మాట్లాడలే—

"గదే నాన్చద్దన్న .... ఇంకో అయిదునూర్లు" కుర్సిల్నుంచిలేసి నిలబడ్డడు లష్మారెడ్డి. ఎంకటరెడ్డి రెండు వేల రూపాయలు నరారిసేతి కిచ్చిండు.

నరారి మీసాల సందుల నవ్వు.

ఆ మాపటికే లష్మారెడ్డి ఎల్లిపోయిండు.

*                *                *

# 7

"నీ యక్క పందులెక్కన్నుంచి అత్తన్నయి; నాత్రి కుంచెడు జొండ్లకు కొట్టినయ్. రేపు పెరడి కోసెయ్యాలె-పులిపచ్చి ఉన్నదనుకుంటే పందులు దక్కనిత్తలేవ్..." అడివిపంది కొట్టిన కర్రల ఏరుకుంట రంధి పడ్తండు కొంరడు.

దట్ట మీనికచ్చి పంటకచ్చిన మక్క పెరచెక్కల్లి సంబురంగు సూసిండు. కిందికి పడి నోట్లె కచ్చిన మీసాల కొరికి ఏందో గాపుకమచ్చి ఎడుమ సేత మీదికి తిప్పిండు.

దూరంగ దట్టపొంట రాజిగాడు దున్నపోతుల మేపుతండు. కొంరడు అడుగేసిండు. కాలుకు ముల్లుకుచ్చింది.

"నీయవ్వ కడుపుగాల బగ్గనే కుచ్చినవ్... నీపణ్జెప్పుతుండు.'' మేటకా న్నుంచి గొడ్డలి పట్కచ్చి మొదట్లకు రేగు తుట్టెను కొట్టేసిండు.

మల్లి గుడిసె ముంగట కూకుండి పచ్చికంకులు ఒలుత్తంది...

కొంరడు అనుకోకుంట పల్లె కెల్లి సూసిండు.

పంతులునరారి ఎంకటరెడ్డి, పోశాలు, నర్సయ్యా, కిట్టయ్యా ముంగట అత్తరుల. ఆళ్ళెనుక పది వదిహేను మంది త న పెరట్కెల్లి [60] అత్తన్నట్టు కన్పించింది. గొడ్డలి భుజాన పెట్కొని భీరిపొయ్యి సూసుకుంట నిలబడ్డడు.

ఎనకచ్చేటోల్లంత దొరోరి పాలేరోల్లు.... సేతుల్ల బరిసెలు కట్టెలు వున్నయి.

పెద్దొర ఎంకటరెడ్డి కొంరని కెదురుంగచ్చి నిలబడ్డడు.

కొంరని ముఖంల రంగులు మారినయ్...

''కొంరా.?" ' కన్న కొడుకును బుదుగరిచ్చినట్టు పిలిసిండు.?"

''ఏంది బాంచెన్?'' కొంరడు స్నెతి సూసిన గొడ్డు వవుతిగ.

''ఈ పెరడి ఎవ్వల్నడిగి దున్నినవ్? ఇది నా కంచెల్ది...'' పొన్ను కర్రి పెరటిమీనికెల్లి తిప్పి సూటిగ సెప్పిండు.

సంగతేందో కొంరనికి తెల్వేది.... అని ముఖంల భీతిపొయ్యి ఎటకారం అచ్చింది.

''దొరా! ఇదినీ కంచెల్దా? పంతులోరినడుగు్రి. మీముంగల్నే ఉన్నడు." నరారి పంతులుకెల్లి ఏలు పెట్టి సూయించిండు.

''ఔన్రికొంర. ఆనాడు కాయితాలు సూడకుంట నిన్ను దున్ను కొమ్మన్న... ఇది దొరోరి కంచె నంబర్లున్నది. అయిన నిన్ను రెండేండ్లకో మూడేండ్లకో దున్ను కొమ్మన్న గని ఎల్లకాలముంచుకొమ్మన్ననా?" నరారి ముఖం సిట్లించుకుంటు అన్నడు.

---

60 పెరడు వైపుగా

కొంరని గుండె బత్తిపెట్టిన బండోలె పగిలింది. సాన సేపటిదాక అని గుమ్మిలనుంచి మాటెల్లలే... అటెనుక అని కండ్లు సీత నిప్పులయినయ్... అంగిలేని అని సాతి ఎగిరెగిరి పడ్డది.

''నర్సయ్య పటేలా! మీరు గుడుక అదే మాటంటర?'' అని గొంతులో కాఠిన్యం.

"ఔనారి కొంర..." ముగ్గురు ఒక్కసారే అన్నరు. నాయం[61] సెప్పె పెద్దమనుసులు!...

రాజిగాడు, మల్లి, కడుమ[62] ఇద్దరు పోరగండ్లు అక్కడికి చేరిన్రు.

''అంటే తమరు పెరడు కోస్క పోనచ్చిన్రా?" అందరి ముఖాల్లలకు సూసుకుంట అన్నడు.

"లంజకొడుక ...నీయవ్వన్‌దెం... కావురమచ్చిందా?" ఎంకటరెడ్డి ఇహ లాభంలేదని-బెదిరించటానిక్కి కాలుసెప్పు ఊడ బీకిండు,

''ఎంకటరెడ్డీ! మాటలు జాగర్తగ రానీయ్... ఎవ్వడనుకొని మాట్లాడ్తన్నవ్.?" గొడ్డలి అని సేతుల మెరిసింది.

ఎంకటరెడ్డి సేతుల్ల సెప్పు కిందేసిండు.

''అరే...అంకా, దుర్గా, సమ్మా, కొండా, మీరంత నా పెరడు కోయటానికచ్చిన్రా? ఇజ్జత్‌లేదు. దుర్గా, నీ ఉన్న రెండు దొయ్యలు సావుకారి కిట్టయ్యకు ఉప్పు పప్పుకింద మట్టసెప్పి దొరోరి కాల్లు నాకుతన్నవ్ ఇంకా సాలలేదా? కొండా! నీ ఈపంత పిగుల గొట్టింది మతికిలేదు. దుర్గా! నీపెండ్లాన్ని దొరోరు ఖరాబు చేత్తే ఆ తప్పుకు కులపోల్లు నిలేత్తే అగ్గెనగాండ్ల గుడిసమ్మి దండుగ్గట్టింది యాదికిలేదు. ఎందుకురా నానోటి మీని కెల్లి సెప్పిత్తరు.? దొర మీన మీకు నిజంగ పేమున్నదారా? ఈ దొర- ఈ పటేండ్లు కాలు మీన

---

61 న్యాయం 62 మిగతా

కాలేసుకొని తింటాన్కి- పుట్టంగనే ఐమ్మతోటి రాయిచ్చుకచ్చిరా?. మనం.. ఈల్ల సచ్చిన గొడ్ల ఈడ్సేసుకుంట ఈల్లపాదాల కింది మట్టి తాకుతే తన్నులు తినుకుంట- మురిగిపోయిన గొడ్లను కోస్కతినుకుంట బతుకాల్నా? ఆరుగాలము ఎండల, సలిల, ముసురుల్ల శరీరాన్ని మాడిసి, నాన్పి కట్టబడితె మనకేమొ తింటాన్కి గింజలు దొరకయ్...కట్టము సేయించుకొని కూలిగింజ లెగబెడ్తరు మాట్లాడితె దండుగ తీస్కుంటరు.... ఇదేనారా నాయం...?... మీకందరకి తెలువదారా? మీరంత నన్ను ఊల్లెనుంచిఎల్లగొట్టిర్రు... ఇన్నిరోజులు ఉపాస ముండి,ఉప్పిడుండి-ఈ అడివిని పెరతు సేస్కున్న... ఎవ్వనయ్యసొమ్ము నాకిచ్చిర్రు?సెప్పుర్రి.... నేనెవ్వల ఇల్లన్న కట్టుకచ్చిన్నా? దోసుకచ్చిన్నా? ఈ నరారి పంతులు అగ్గెన గాండ్ల దెబ్బయి రూపాలు తీస్కోని పదిరోజులు కట్టెలు కొట్టిమ్పుకొని... "నరారి పంతులూ! తూ ఏం జెల్మమునీది ! అడుక్కుంటె ఇంకీయ్యక పోదునా? నీ కంటె దున్నపోతునయం.'' కొంద్రకిచ్చి బట్టమీన ఊంచిండు.

నరారి పంతులు సెప్పిసిరిండు. కొంరని నొసలుకు తాకింది.బొడుసచ్చింది.

ఎడుమ సేత పుసికి సూస్కున్నడు...కొంరడు ఊగిపోయిండు.

''మంచి మాటకు సెప్పుతన్న... పోండి నా పెరట్కానుంచి పోండి.... లేకుంటె నేనేం సేత్తనో నాకె తెలువదు'' కొంరడు గొడ్డలి భుజాన పెట్టి ఉగ్గ నర్సిమ్మ సామి రూపం దాలిసిండు.

'సూత్తరేందా! అన్ని ఇరిసికట్టేయిర్రి...'' దొర పాలేరోల్ల కెల్లి సూసిండు

"కట్టేత్త రారా? కట్టేయాలిసింది- నన్నుకాదుర ఈల్లను..." అయిదుగురి దిక్కు ఏలుపెట్టి సూపిండు... "ఈల్లయిదుగురు, జెనిగెల[63] వవుతుగ పీలుసుక తింటన్న ఈల్లు. మాదిగి గూడెంల ఒక్కని శరీరంల మాంసమున్నదారా? ఆ మాంసమంత ఈల్లకున్నది..... మన మెంతమంది మున్నము? ఇంతమంది ముండి... ఈల్లు... మనల్ని తూ..., ఈల్లు సెప్పితె మనం మనం తన్నుకొని సావాలె- దూరంగ నిలుసుండి ఈల్లు నవ్వుతరు. అంకన్నా? దుర్గన్నా- కొండన్నా? మీఅందరికి నేను బుద్దెరిగి నప్పన్నుంచి ఏమన్న పాపం జేసిన్నా నర?... కులంలేదని గూడెంల నుంచి ఎల్లగొడ్తిరి.. నా మానాన నేను అడివి

---

68 జలగల వలె

కచ్చి బతుకుతంటే, అట్లయిన బతుక నియ్యర్రా?..." కొంరని కంఠం జీరవోయింది.

"సూత్తరేముర్రా?" దొరోరు గద్దరాయించిండు.

పాలేరోల్లంత ఒకల ముఖా లొకలు సూసుకున్నరు. కొంరడు సెప్పిన దాంట్లఆల్లకుఅబద్ధమేమీ కన్పించలే. ఇన్నేండ్లు తన్నినదొర తిట్టినదొర–...పెండ్లాలను ఖరాబుసేసినదొర—అంతటిదొరను ఎదురించలేక కుమిలిపోయిర్రు. కొంరడు గొడ్డలి భుజాన పెట్టుకొని ఎదురిత్తండు. ఇప్పుడు కొంరన్ని ఇరిసి కట్టేత్తె రేపుదుర్గన్ని, కొండన్ని... ఇట్లా అందర్ని కట్టేసి తంతండు...

పాలేరోల్లు సప్పుడు చేయకుంట నిలబడ్డరు.

"లంజకొడుకు లారా!... మీకు...'' పొన్నుకర్ర నెత్తిండు ఎంకటరెడ్డి ఏమనుకున్నడో ఏమో?– మల్ల దించిండు.

దొరకు ముచ్చెమటలు పోసినయ్– గుండె జెప్పజెప్పకొట్టుకున్నది... ఈ మాదుగులంత సెప్పు కింది నల్లులనుకున్నడు. ఇప్పుడుతేల్లయి పోయిర్రు. "బలవంతంబగు సర్పము చలిచీమల చేతజిక్కి చావదె సుమతీ...'' సిన్నప్పుడు సదువుకున్న పజ్జెం. ఇప్పుడేంసేయాలే?... లాంచెలు, మాదుగులు ఏకమయిర్రు కొంరనికెల్లి చేరిర్రు. ఇన్నేండ్లుగ ఎదురులేకుంట సాగుతన్న దొరతనం–ఓడిపోతంది...ఏంసేయడం?...

పోశాలు, కిట్టయ్య, నరారి మాటలు రాక సూత్తర్రు.

అంకని సేతుల కొడవలి గుంజుకున్నడు. పెరట్ల కడుగుపెట్టిండు. ఎనకకు, పోతే మాదిగోల్లు, పాలేరోల్లు.

''రెడ్డీ...'' గాండ్రిచిండు కొంరడు.మనిసిఊగిపోతండు–సేతులగొడ్డలి

"మిమ్ములందరిని నరికి ఈ దట్టమీన కుప్పలు పెడుత, అవెనుక నా పెండ్లాన్ని, పోరగాండ్లను నరికి నేను సత్త... ఈపెరడిబొబ్బిలి గావాలె'' గొడ్డలి గాలిల తిప్పిండు.

ఎంకటరెడ్డి ఆగి ఖండవతోటిముఖంమీని సెమీట తుడుసుకున్నడు... అడుగు ముంగటికేసిండు.

కొంరడు దబదబ దట్టమీనికెల్లి వెంకటరెడ్డి కెల్లి నడిసిండు. దొరోరి సాతిమీని లాలిసిని ఎడుమ సేతపట్టి ఒక్కసారి కుదిచ్చిండు.

రెడ్డి కొడవలి పైకిలేపిండు, గొడ్డలితోటి ఒక్క దెబ్బ కొడవలి మీన

కొట్టిండు- సెయికి దెబ్బతాకకుంట- కొడవలి పోయి పెరట్ల బడ్డది...కొంరని దవుడమీన గుద్దిండురెడ్డి...

కొంరడు పులోలె రెచ్చిపోయిండు.... గొడ్డలి పారేసి ఈడిసి దవుడ మీన గుద్దిండు. దవడ పండ్లూసినయ్. నోటినిండ నెత్తురు.

రెడ్డి పాలేరోల్ల కెల్లి ఆశగ సూసిండు. పాలేరోల్లు ఊగుతర్రు.. కాని అడుగు ముందుకెయ్యలే.

నర్సయ్య, పోశాలు, కిట్టయ్య, నరారి ఇంటి తొవ్వ బట్టిర్రు.

రెడ్డికి దుఃఖమచ్చింది... కాని ఏంజేత్తడు? కొంరడు దొరోరిని ఈడుసు కచ్చిదట్ట ఆవలికి గట్టిగ నూకిండు. దొరోరు బొక్క-బోర్ల పడ్డడు. దొరోరు- ఇన్నేండ్లు గరీబోల్ల తోలు పికుల గొట్టిన దొరనొసలు సిట్లింది.

ఇగ లాభం లేదని ఎనక్కు సూడకుంట లేసి ఉరుకుతండు...

మాదిగి కొంరడు గెలిసిండు.... మాదిగోళ్ళే గెలిసిర్రు.

"అంతా, కొండా, దుర్గా, మల్ల ఈ పెరడు దట్ట తొక్కకుర్రి. మతి కుంచుకోర్రి. ఈ దొరలు కూకుంటె తొక్కుతరు- అంగితె ఎక్కుతరు- నిల బడితె మొక్కుతరు. రాయే మల్లి" మల్లి రెక్క బట్టుకొని గుడిసెకెల్లి నడిసిండు. పెద్ద పెద్ద అడుగులేసుకుంట.

పాలేరోల్లకు అట్లా గుడిమెట్టు కెల్లిపోతన్న కొంరడు గుడి మెట్టంత ఎదిగి నట్టనిపించింది.

పల్లె కెల్లి మరిలిర్రు, ముంగట పోతన్న నర్సయ్య, పోశాలు, కిట్టయ్య నరారి, ఆఎనుక గోసె ఈసి పోంగ రాల్లల్ల బడి ఉరుకుతన్న పెద్దార- సీమల వవుతుగ [64] అనిపిచ్చిర్రు.

ఎదురు తిరిగితే దొరలంతా కాయితం పులులే. కాని.... కొంరడు ఒక్కడే ఎదురు తిరిగితే లాభం?

(అయిపోయింది)

(ఈ కథలోని పాత్రల పేర్లూ,సంఘటనలూ కేవలం కల్పితం. ఎవరినీ వుద్దేశించి రాసినవి కావు. –రచయిత)

ఈ కథపై పాఠకుల అభిప్రాయాలను ఆహ్వానిస్తున్నాం.

సం॥

64 చీమల వలె

# చైనాలో కొత్త రంగస్థల రూపకాల సంచలనం

సారస్వత కళా రంగాలలో, మావో కార్మికవర్గ పంథా మార్గదర్శకత్వం కింద, విప్లవ రంగస్థల రూపకాలలో కొత్త నమూనాలివి—

ఈ రంగంలో చైనా కార్మికవర్గ విప్లవ ఘన విజయాలు నగరాలు గ్రామ సీమల్లో విరివిగా ప్రచారం గావించబడ్డాయ్. అలాంటి ప్రదర్శనలు ఎక్కువగా సృష్టించ బడుతున్నాయ్.

ఇంతవరకూ ఉన్న విప్లవ రంగస్థల రూపకాలు—

నూతన పెకింగ్ ఒపేరాలు: ''ఎర్రలాంతర్," ''ఎర్రపూల పర్వతం," ''పులి పర్వతాన్ని వ్యూహంలో వశపర్చుకోవడం'' "సాచియాపాంగ్,,', ''ఓడపైన,'' ''తెల్లపులి సైన్యంపైదాడి,'' ''డ్రాగన్ నది పాట,'' ''స్త్రీల ఎర్రదళం,'' ''మైదానాల్లో పోరాటం."

నూతన నృత్య నాటకాలు: ''స్త్రీల ఎర్రదళం,'' ''తెల్లకురులబాలిక.''

సింఫనిక్ సంగీతంపై కూర్చబడినవి: ''సాచియాపాంగ్", "పులి పర్వతాన్ని వ్యూహంతో వశపర్చుకోవడం." పియానో సంగీతంపై కూర్చబడినవి: ''ఎర్రలాంతర్'' తోపాటు పెకింగ్ ఒపేరాపాటలు. పియానోకన్‌సర్‌టోపై కూర్చబడినవి: పసుపు పచ్చనది.''

రెండు నూతన నృత్య నాటకాలు: "యెమూంగ్ కోసం పాట'' ''పచ్చిక బయలు పిల్లలు" అనేవి ప్రయోగాత్మకంగా ప్రదర్శింప బడుతున్నాయి.

రివిజనిస్టు పంథాను విమర్శిస్తూ, సారస్వతం కళలపై మావో శ్రామిక సిద్ధాంతాన్ని విప్లవ సాహిత్యకారులు కళాకారులు ఆచరణలో పెట్టగావచ్చిన ఫలాలే ఈ ప్రదర్శనలు. పార్టీ సాధారణ పంథాను మార్గదర్శకంగా తీసుకొని రచయితలు కళాకారులు ఈ పదికి పైబడ్డ రూపకాలలో 50 సంవత్సరాలకు పైగా చైనా కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలో సాయుధ శక్తితో రాజకీయ అధికారం గుంజుకోవడానికి చైనా ప్రజలు జరిపిన కష్టతరమైన పోరాటాలు, శ్రామికవర్గ నియంతృత్వం కింద విప్లవాన్ని కొనసాగించడానికి వారు జరిపిన పోరాటమూ వివిధ కోణాలలో ప్రతిబింబించారు.

శతాబ్దాలుగా చక్రవర్తులు, రాజులు, సైన్యాధిపతులు, మంత్రులు, పండితులు, రాణులు మొదలగువారు ఆక్రమించుకున్న రంగస్థలం ఈకొత్త రంగస్థల రూపకాలలో శ్రామికులను నాయకులుగా చిత్రించడంతో నూతన రూపు సంతరించుకున్నది.

"పాతను కొత్తకు ఊడిగం చేయించేలా, విదేశీయమైన దానిని చైనాకు ఉపయోగపడేలా చేయడం- పాతను తోసివేస్తూ, కొత్తను వెలికి తీయడం'' అనే విధానాలకు అనుగుణ్యంగా పాత పెకింగ్ ఒపేరా నృత్య నాటికలను మన సాంప్రదాయక కళారూపాలను సంస్కరించి విప్లవరచయితలు కళాకారులు జాతీయ విలువలు గల సరికొత్త శ్రామిక కళల్ని సృష్టించారు

"విప్లవ రాజకీయ విషయానికి సాధ్యమైనంత ఉన్నత కళారూపానికి ఐక్యత," ఉండాలని సాహిత్యం కళలపై యెనాన్ ఫోరమ్‌లో మావో చేసిన బోధనలకనుగుణ్యంగా ఈ రూపకాలు నిర్మించ బడ్డాయి.

ఈ నమూనా విప్లవ రంగస్థల రూపకాలు మార్క్సిజం - లెనినిజం - మావో ఆలోచనా విధానాన్ని విస్తృతప్రచారం గావించి "శత్రువును ఎదుర్కొని నిర్మూలించడానికి, ప్రజలను ఐక్యపరచి చైతన్యవంతం చేయడంతో విప్లవ సాహిత్యం కళలు సమరశీల పాత్ర నిర్వహించాయి. చైతన్యస్ఫూర్తిగల వీటికి కార్మిక, కర్షక, సైనికులు, దేశంలోని వివిధ జాతుల ప్రజలు స్వాగతం పలికారు.

లిన్‌పియావో, కన్‌ఫ్యూషియస్‌లను విమర్శించే లోతైన ఉద్యమం తీవ్రం కావడంతో విప్లవ రంగస్థల ప్రదర్శనలు మరింత విస్తృతంగా ప్రచారమైనాయి.

"మైదానాల్లో పోరాటం," "ఎర్రపూల పర్వతం" అనే పెకింగ్ ఒపేరా సినిమాలు కూడా చైనా అంతటా చూపబడుతున్నాయి. అన్నీ కలిపి 14 నమూనా రంగస్థల రూపకాలు చిత్రాలుగా నిర్మించడంగాని ఫోనోగ్రాఫ్ రికార్డులు చేయడం గాని జరిగింది.

నమూనా విప్లవ రంగస్థల రూపకాల, చైనా యొక్క ముఖ్యమైన ప్రాంతీయ ఒపేరా రూపకాల నుండి గ్రహింప బడ్డాయి. సికియాంగ్ ఇన్నర్ మంగోలియా, క్వాంగ్‌షీ మొదలగు అల్పసంఖ్యాక జాతుల ప్రాంతాలలో నమూనా రంగస్థల రూపకాలు ప్రాంతీయ కళారూపంతో, భాషతో ప్రదర్శింపబడ్డాయి.

వృత్తి కళాకారులు, రచయితలు, ఔత్సాహికులు కూడా ఈ నూతన రంగస్థల ప్రదర్శనల నుండి నేర్చుకున్నారు. వీటిని ప్రదర్శించారు. శ్రామిక వర్గ నియంతృత్వం క్రింద విప్లవం కొనసాగించడానికీ, సోషలిస్టు విప్లవ నిర్మాణం కొనసాగించడానికి ఈ రూపకాలలో సృష్టించబడ్డ విప్లవ నాయకుల పాత్రలు అశేష ప్రజానీకమూ, కేడర్ల యొక్క స్ఫూర్తిని గొప్పగా ఉత్తేజ పర్చాయి.

ఈ విప్లవ రంగస్థల నమూనా రూపకాల సృష్టి సినిమా పరిశ్రమను, ప్రాంతీయ ఒపేరా రూపకాలను అభివృద్ధి పర్చడం, ముందుకు తీసుక పోవడం మాత్రమే కాకుండా, ఇతర కళారూపాలయిన సాహిత్యం, లలిత కళలు, సంగీతం, నృత్యం మొదలగు వాటికి ఎంతో విలువైన అనుభవాలనిచ్చాయి.



# చైనాలో కొత్త నవలలు

ఈ మధ్య వచ్చిన చైనా నవలల్లో చెప్పుకోదగ్గ విషయం కార్మిక, కర్షక, సైనికులను నాయకులుగా తీసుకుని, సమకాలీన పోరాటాలను చిత్రించడం.

గత రెండు సంవత్సరాల కాలంలో పెకింగ్, షాంగై, టేన్‌షిన్‌లలో ప్రచురింపబడ్డ డజనుకు పైగా నవలల్లో పదివరకూ వర్గపోరాటాన్నీ, సోషలిస్టు కాలంలోని రెండు పంథాలమధ్య పోరాటాన్ని చిత్రించాయి.

ఉత్తరచైనాలో ఒక గ్రామం 20 సంవత్సరాల విప్లవపరివర్తనను "వెలుగుబాట" అనే నవల వర్ణిస్తుంది. అందులో రచయిత సోషలిస్టు చారిత్రక కాలానికి పార్టీ సాధారణ పంథాను మార్గదర్శకంగా తీసుకొని, సోషలిస్టు విప్లవ కాలంలో శ్రామికవర్గానికీ బూర్జువావర్గానికీ, సోషలిస్టు మార్గానికి, మావో విప్లవ పంథాకు, రివిజనిస్టు పంథాకు మధ్యపోరాటాన్ని సమర్థవంతంగా చిత్రించాడు. ఈ నవల మొదటిభాగం రెండు సంవత్సరాల క్రితం వచ్చింది. మొదటి ఆరు నెలల కాలంలోనే 30 లక్షల కాపీలు అమ్ముడయినాయి.

"సుళ్ళు తిరిగే మంచు వసంతాన్ని తెస్తుంది" అనే నవల 1968–69లో మొదటిసారిగా ప్రచురింపబడింది. దాని మొదటి ముద్రణ కాపీలు 900,000. అది దక్షిణ చైనాలోని ఉక్కుగని కార్మికులు రివిజనిస్టు పంథాకు వ్యతిరేకంగా సాగించిన ఉధృత పోరాటాలను వర్ణిస్తుంది.

విముక్తికి పూర్వం ఈ గనియజమానులైన సామ్రాజ్య వాదులకు, పెట్టుబడిదారులకు వ్యతిరేకంగా కమూనిస్టుపార్టీ నాయకత్వంలో ఈగని కార్మికులు నిర్వహించిన పోరాటాన్ని చిత్రిస్తూ, ఈ నవల సాంస్కృతిక మహావిప్లవం శ్రామికవర్గం, బూర్జువావర్గానికి వ్యతిరేకంగా నడిపిన దీర్ఘకాల పోరాటం యొక్క కొనసాగింపే అని తెలుపుతుంది. ఇదిగని కార్మికులచే వారి జీవితాల గురించి, పోరాటాల గురించి రాయబడిన మొదటి నవల. ఒక బొగ్గుగని కార్మికుడు, నాయకత్వంలో ఉన్న ఉక్కుగనిలోని ఒక కామ్రేడ్, ఒకయువ సాంకేతిక నిపుణుడు, ఈ ముగ్గురు దీని రచయితలు. కాకలు తీరిన నలుగురుగని కార్మికులు వారికి సలహాదారులుగా వ్యవహరిస్తూ తోడ్పడ్డారు. ప్రతి అధ్యాయం పూర్తికాగానే గని కార్మికులకు చదివి వినిపించి వారి అభిప్రాయాలను తీసుకునేవారు. శ్రామిక వర్గం నూతన తరాన్ని ఈ నవల సమర్థవంతంగాచిత్రించింది.

"యాత్రలో" అనే నవల శ్రామికవర్గ విప్లవ వారసులను తయారు చేయడంగురించి రాయబడ్డది. షాంఘైలోని ఒక రెడ్‌గార్డ్స్‌దళం గురించిన కథయిది. విద్యావంతులైన యువకులు గ్రామ సీమలకు వెళ్లాలనే మావో పిలుపుకు అనుగుణ్యంగా వీరు సరిహద్దు గ్రామాలలో స్థిరపడడానికి వెడతారు. వారు మధ్యతరగతి రైతులతో, పేద రైతులతో మమేకమయి వర్గ పోరాటాల్లో

రాటు దేలుతారు. "శాంతియుత పరిణామం" కొరకు సామ్రాజ్యవాదులు చైనా యువతరంపై ఆశలుంచుకోవడాన్ని "అధికార్లు కావడానికి చదువు కోవడం" అని రివిజనిస్టులు చేసే తప్పుడు ప్రచార ధోరణినీ యువతరం ఈ నవలల్లో బద్దలు కొడుతుంది.

ఈ కొత్త నవలల రచయితలు అనేక సంవత్సరాల నుండి ప్రజలలో నివసించడం మూలంగా కార్మిక, కర్షక, సైనికులను లోతుగా అవగాహన చేసుకున్న రచనే వృత్తిగాగల రచయితలు, తీరుబడి కాలంలో రచనలు చేసే కార్మిక, కర్షక, సైనికులైన ఔత్సాహిక రచయితలు (మొదటి రకం వారికంటే సంఖ్యలో వీరేఎక్కువ) ఈ ఇరువురు కూడా-"విప్లవసారస్వతం కళలు నిజ జీవితం నుండి విభిన్న పాత్రలను సృష్టించి, చరిత్ర పురోగమనానికై ప్రజలకు తోడ్పడాలి"-అన్న మావో బోధనలకు అనుగుణ్యంగా రాస్తున్నారు.

వీటిలో అనేక నవలల్లో నాయకపాత్రలు పై సూత్రానికి అనుగుణంగా సృష్టింపబడి నిజ జీవితంలోని శ్రామికవర్గ ఉత్తమ ప్రతినిధుల సుగుణాలతో పొదగబడి ఉంటాయి. అందువలన ఈ నవలలు ప్రబోధాత్మకమైనవిగా రూపొంది, కార్మిక కర్షక సైనికులచేత ఆదరించబడుతున్నాయి.

—

# చైనాగురించి మూడు మహాగ్రంథాలు

(సమీక్ష)

నలభై ఏళ్ళ క్రితం మాట. అప్పట్లో నాకూ నాలాంటి వాళ్ళకూ జాక్ బెల్డెన్ అంటే కథలు చెప్పుకోవలసినంత పేరు మోసిన మనిషి. చైనాగురించి మంచేగాక, చెడుకూడా అతనికి క్షుణ్ణంగా తెలుసు. ఎడ్గార్‌స్నో, అన్నాలూయిస్ట్రాంగులు తప్ప తక్కిన వాళ్ళమంతా హెచ్చుగా ఒక్కరకం వాళ్ళం. చైనాలో పెరగడంగాని, ముందుగా ఎవరో ఏర్పాటుచేసిన ఉద్యోగాలు చెయ్యడం కోసం చైనాకు రాయడంగాని, లేదా, ఫెలోషిప్పులు సంపాదించుకుని చైనాభాష నేర్చు

కుందుకు రాయడంగాని మా విషయంలో జరిగేది. బెల్డెన్ అలా కాదు. బలిష్ఠుడైన నావికుడుగా అట్టడుగునుంచి పైకి వచ్చి హాంగ్‌కాంగ్‌లో నౌకనుంచి దుమికి చైనా కోస్తానగరాలలో కిందా మీదా పడుతూ కోస్తాకు దూరంగా ఉన్న దేశాంతర్భాగంలోకి కూడా చొచ్చుకుపోయి వస్తుండేవాడు. ప్రథమం నుంచి బుద్ధి జీవులంటే తనకి అట్టే గురి కుదిరినట్టులేదు దిక్కు మొక్కు లేని నిర్భాగ్యులతో మమేకమయ్యేవాడు. పూరా పనిలేని రైతులు నిండు జీతబత్తెలు లేని పని వాళ్ళు, సైనికులూ, సెక్స్ విషయంలో ఏమి చేసేది ఎలా చేసేది తెలిసిన మనిషి ఎవరంటే బెల్డన్‌నే చెప్పుకోవాలి.

జాక్ బెల్డన్ సుప్రసిద్ధ అమెరికన్ జర్నలిస్టు. 1930 ప్రారంభంలో నౌకనుంచి తప్పించుకుని చాలా సంవత్సరాలు చైనాను చుట్టివేశాడు. జపాను దండయాత్రలో తొలిదశగురించి రిపోర్టు చేస్తూ వచ్చాడు. బర్మాకు వెళ్ళి 'రిట్రీట్ విత్ స్టిల్వెల్' అనే పుస్తకంలో ఇంగ్లీషువాళ్ళు, అమెరికన్లు, చైనీయులు పొందిన పరాజయాన్ని వర్ణించాడు. 1946లో చైనాకు తిరిగి వెళ్ళి చియాంగ్‌కై - షేక్‌కూ కమ్యూనిస్టులకూ మధ్యసాగిన అంతర్యుద్ధాన్ని "చైనా షేక్స్‌దివరల్డ్''లో అద్భుతంగా వర్ణించాడు.

1937లోచైనాపై జపాను దండయాత్రమొదలైంది.అప్పటికే అయిదేళ్ళుగా ఆయన చైనాలోఉంటున్నాడు. జపానువాడి పోటు ఎక్కడెక్కడైతే గట్టిగా తగులు తుందో ఆ ప్రాంతాలనన్నింటిని స్వయంగా వెళ్ళి చూసి ఉన్నాడు. ఆ భాష తెలుసు. మేధావుల భాషకాదు. చదువులు వచ్చిరాని, అసలేరాని వాళ్ళభాష. మేధావులంటే బెల్డన్ జాగ్రత్తపడుతాడుగాని కార్యశూరులంటే చెవి కోసు కుంటాడు. వీళ్ళతో తాను మమేకం కాగలడు, సిద్ధాంతం గట్టా తెలుసు. అయితే వాటికి తన మనస్సు తాకట్టు పెట్టుకోడు. మిడిల్ స్కూలుదాకా చదివి చియాంగ్‌కై - షేక్ పోలీసు బలంలో చేరిన ఒకతని గురించి, ఈ పుస్తకంలో రాస్తూ ఆ నిరాదరణకు తట్టుకోలేక ఏనాన్‌కు వెళ్ళిపోయి బెల్డన్ కలిసేనాటికల్లా కార్యకర్తగానూ గెరిల్లా నాయకుడుగానూ రాటుదేలి పోటుబంటైన ఒక చైనీస్ యువకుణ్ణి వర్ణిస్తాడంటే, ఇలాంటి వాళ్ళను ఆత్మీయులుగా భావించినందు చేతనే కమ్యూనిస్టు ప్రాంతాలలో ఈ తరహా మనుషులకు కొదువేమీ లేదని కూడా అంటాడు. ''ఇతనిలో క్రియా పరత్వమూ, మేధావి తనమూ పరమ మనో

హారంగా కలగలిసాయి. ఇలాంటివాళ్ళు గనుక కమ్యూనిస్టు ఉద్యమంలో పెత్తనానికి వస్తే అందుగురించి జడుసుకోవలసింది ఏమీ ఉండదని నేను తరచూ అనుకునేవాణ్ణి. అలాగాక శుద్ధమేధావులది పైచెయ్యి అయితేనా శిష్టకూటమి తత్వం చైనాలో పాలన సాగించవచ్చు.

చియాంగ్ సైన్యానికి ఉన్నతాధికార వర్గానికి ఎరై దోపిడికి గురైన రైతులు ఉత్తర హోనాన్‌రాష్ట్రంలో పన్నులతోటి తన్నులతోటీ హూనమై చివరికి తిరగబడి జపాను వాడికెలా స్వాగతం చెప్పారో బెల్డెన్ వర్ణించాడు. (1944లో జెహోల్ రాష్ట్రంలోని ఒక లక్ష చదరపుమైళ్ళ ప్రాంతాన్ని పది రోజుల్లోనే జపానువాళ్ళెలా ఆక్రమించు కోగలిగిందీ నాకు గుర్తుంది. జపానువాడికోసం ఎదురుచూస్తున్న రైతుల నడిగితే వాళ్ళన్నారు, "జపాను వాళ్ళంటే మాకెరికలేదు మా గవర్నరు మాత్రం ఎరికే. వాడి కాలేయాన్ని కొరికితిని వాడి రక్తం తాగామంటె అదిచాలు'') ఆ తర్వాతి కాలంలో బెల్డెన్ బర్మాలో ఆంగ్లో-అమెరికన్- చైనీస్ పరాజయాన్ని చూశాడు (రిట్రీట్ విత్ స్టిల్వెల్) ఉత్తరాఫ్రికాలో యూరపులో మిత్రరాజ్య సైన్యాలు దిగడమూ చూశాడు (స్టిక్ టైమ్ టుడై) యుద్ధాన్ని విశేషంగా చూశాడు. చాలాగొప్ప యుద్ధ విలేకరులలో ఒకడనిపించుకున్నాడు గాని అతని రిపోర్టులు పూర్తిగా అచ్చైవచ్చేవి కావు.

1941 నాటికి తిరిగి చైనాకు వచ్చి చేరాడు. అంతర్యుద్ధం చివరి దశను గురించి రికార్డు చేసేందుకు తనకంటె ఎక్కువ యోగ్యతలున్న రిపోర్టరు లేడు. భాష తెలుసు, దేశం తెలుసు అటు అమెరికన్లూ ఇటు చియాంగ్‌కై-షేక్ ముఠా, వీళ్ళ తాలూకు గతాను గతికమైన యుద్ధతంత్రం, చైనా విషయంలో అమెరికన్లకుగల గతానుగతికమైన భావచిత్రం- ఇవన్నీ తెలుసు. తతిమ్మా విలేఖరులకంటే హెచ్చుగా తెలుసు. అమెరికన్ విధానకర్తలేమి, (బోలెడంత డబ్బుఖర్చుతో కూడుకొని) స్వాతంత్ర్యం, 'ప్రజాతంత్రం' అనే మాటలు జపిస్తూ అప్పటికే రూపు దిద్దుకకోగలిగిన విప్లవాన్ని వెనక్కి తిప్పి వెయ్యగల ఒహాయోలో లాంటి, లేదా న్యూ ఇంగ్లాండులో లాంటి ప్రభుత్వాన్ని ఆవాహన చేసుకుంటూ వచ్చిన చైనీస్ నగరాల్లోని అమెరికన్ కాన్సళ్ళు, చియాంగ్ సైన్య దళాల్లోని అమెరికన్ ఆఫీసర్లూ మిషనరీలు సరేసరి, అనేక సహాయ సంస్థల తాలూకు

ప్రతినిధులూ వీళ్ళేమి' తమ కళ్ళముందే సాగిపోతూన్న విప్లవ వాస్తవాలను కళ్ళువిప్పి చూసేందుకు మొండిగా బండగా కక్షగా నిరాకరిస్తూ వచ్చారు. ఈ విషయాన్ని గమనించి నప్పుడు చైనీస్ విప్లవంగురించి మహోత్తమమైన రిపోర్టులు చాలా విస్తారమైనవి. వాటన్నిటి గురించి వ్యాసం రాయడం అప్రస్తుతం. అయినా జాక్ బెల్డెన్ రచనగురించి రాసేప్పుడు రెండు సంగతులను మాత్రం పేర్కొనక తప్పదు.

చైనా మీదికి జపాన్ మొత్తంగా దూకి పడడం మొదలైనప్పుడే ఎడ్గార్ స్నోరాసిన రెడ్ స్టార్ ఓవర్ చైనావెలువడింది. గ్రంథకర్త చిత్తశుద్ధి ఎవరూ కాదన లేనట్టిది. లాంగ్‌మార్చ్ ముగించి ఏనాన్‌కు వచ్చి చేరుకున్న కమ్యూనిస్టు నాయకులు ఎలాఎలా ఉండేవారో, తమగురించీ తమ ఉద్యమం గురించీ వాళ్ళు ఏమేమి చెప్పారో, వారి మాటల్లోనే ముప్పై ఏళ్ళ క్రితం, మనకు చెప్పిన మొట్టమొదటి మనిషి తాను. కమ్యూనిస్టు ప్రచారానికి బాకా అని చియాంగ్ కై-షేక్ అభిమానులు తనను తెగనాడే రోజుల్లో ఒక కమ్యూనిస్టుతోటి నేను మాట్లాడ్డం జరిగింది. ఆ కమ్యూనిస్టు తల అడ్డంగా తిప్పాడు. అదేమీకాదు చిత్తశుద్ధి విషయంలో ఎలాంటి డోకాలేని మనిషిగానే తాము స్నోను గౌరవిస్తామని అతనన్నాడు. వాస్తవ ఘటనను గురించి స్నోచేసే రిపోర్టులు విశ్వసించదగ్గవి. వాటికి అతను చేసిన వ్యాఖ్యానాలు, వివరణలు స్నోను కమ్యూనిస్టుల "అధికార వాణి" (స్పోక్స్‌మన్)గా చెయ్యలేవు. ఎందుకంటే, మార్క్సిజాన్ని తాను నిజంగా బోధ పరచుకోలేదు.

కావచ్చుగాక, ఆ సమయంలో చైనాలో ఉండిన వాళ్ళ కొక్కరికీ 'రెడ్ స్టార్ ఓవర్ చైనా' కలిగించిన తాకిడి గుర్తుంటుంది. రెడ్ బేండిట్‌లను (కమ్యూనిస్టులను దారిదోపిడి గాళ్ళుగా చియాంగ్ ముఠా వ్యవహరించేది) పురుగేరి వేశామనో, పారేయ మన్నామనో, మాటలిటూ అటూమార్చి పదేళ్ళ బట్టీ కొమింటాంగ్ అంటూ వచ్చింది. మరికొమింటర్న్ (మూడవ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్) పత్రికల్లో వామపక్ష పత్రికల్లో వస్తూండిన ఘూటైన వ్యాసాలు, శ్రామిక వర్గ నాయకత్వం కింద రైతుపీడులు పరిజానీకం కోసం ఎలా పోరాటం చేస్తుండేవారో వర్ణించేవి. ఆ పత్రికలను మేమెవళ్ళం చూడలేదు. (ఆ రోజుల్లో వాటి ఉనికి మనికి గురించి నాకే చాలా అస్పష్టమైన అభిప్రాయం ఉండేది) అయితే,

ఈ వీరులు రక్తమాంసాలుగల యదార్థ వ్యక్తులుకారు మూసలోపోసి తీస్తే వచ్చే ఒకే రకమైన బొమ్మల్లా గుండేవారు (స్టీరియోటైప్స్) చైనాలో ఉంటూ వచ్చిన విదేశస్థుల్లో హెచ్చు భాగం తాలూకు రాజకీయ పరిభాష, అర్థం పర్థం లేని మాటలతో నిండి ఉండేది. చైనీయులకు అందులోనూ రైతాంగానికి రాజకీయాల్లో ఆసక్తి పూజ్యం. శాంతి భద్రతలు సమకూర్చి న్యాయమైన పన్నులు విధిస్తే వారికి ఇక నేమీ అక్కర్లేదు, మరెవరికీ బాధ కలిగించరు. 'ఉన్నత వర్గాలు.' 'జనసామాన్యం' అనే మాటలన్ని 'ఆందోళనకారుల' పడికట్టు మాటలే చైనాకు కావలసిందల్లా గట్టి వ్యక్తిత్వంగల మనుషులే 'దైవామోదం' కలిగిన వాళ్ళ బాపతు, 'మిన్ను కింది మంది నందరినీ' అణచివుంచగల గట్టిమనిషికి తగినంతగా చియాంగ్ కై- షేక్ నిరూపించుకుంటాడా, అదే సమయంలో విదేశీ రాజ్యాల ప్రయోజనాలకు పూచీఇస్తాడా అనేది పెద్ద ప్రశ్న. జపానీ 'దృఢహస్తం' అవసరమని: చైనీయులను మొట్టి తెలివి వచ్చేలా చెయ్యగలదనీ చైనాలో ఉన్న విదేశీయుల్లో అనేకులు భావించేవాళ్ళు

పరోక్షంగా చైనాను అదుపు చేసి అన్ని సామ్రాజ్యవాద రాజ్యాల మధ్య స్వేచ్ఛాయుతమైన పోటీని కనీసం సిద్ధాంతం మేరకైనా కొనసాగింప గోరుతూన్న అంతర్జాతీయ బృందం తాలూకు నియమాలను ఉల్లంఘిస్తూ, 'మంచుకో' లా ప్రత్యేక ప్రయోజనాలు గల విశాల ప్రాంతాలను చైనాలో జపాన్ తొలిచి సొంతపరుచుకుంటూందని కొందరైనా ఆందోళన చెందిన మాట వాస్తవం. సదరు బృందంలో సభ్యత్వంగల జపాన్ అరాజకమైన కల్లోలకరమైన విధానాన్ని అనుసరిస్తుంటే దాన్ని అదుపులో పెట్టేందుకు నిరాకరించే ఈ బృందం ప్రామాణికమైన శాంతిభద్రతలు కావాలని ఎలా అడుగుతూ రాగలదు?

రాజకీయ భావన మనస్సును కుంగదీస్తున్న ఈ సందె చీకట్లో, స్నో రాసిన 'రెడ్‌స్టార్ ఓవర్ చైనా' బాణాసంచా ప్రదర్శనంలాగా మిరుమిట్లు గొలుపుతూ వచ్చింది. అప్పటివరకు కనపడకుండానో, అస్పష్టంగా ఊహించబడుతూనో ఉండిన విషయాల తాలూకు రూపురేఖలు, స్పష్టమయ్యేలా అది చూపింది. ఇది ప్రచారంకాదు, వర్ణన. మరో చైనా ఒకటి ఉంది. కమ్యూనిస్టు నాయకులు ఏమి చెప్పారో స్నో మాకు ప్రచారం చేశాడు. వాళ్ళు చెప్పింది, సిద్ధాంత సూత్రాలను వల్లించే గ్రామఫోనుల రికార్డులాంటిదికాదు, ఆనాటి చైనా

సమస్యలకూ జపానుకు వ్యతిరేకంగా నిర్వహించవలసిన ప్రతిఘటన సాధ్యా సాధ్య విషయాలకూ అన్వయించదగిన క్లుప్తమైన సూచనలు. అంతేకాదు రెడ్ స్టార్ బృహత్ గ్రంథం. నాయకులు చెప్పిన మాటల తాలుకు కొటేషన్లను మించిన దానిపై ఆ గ్రంథం తాలూకు శాశ్వతమైన ప్రాముఖ్యం ఆధారపడి ఉంది. కమ్యూనిస్టు నాయకత్వం ఒక పదార్థానికి గల కేంద్రంలాంటిదైతే, దాని చుట్టూ, తమంత తాముగా ఆ కేంద్రం వైపుకి పలు వలయాలుగా అనేకులు వచ్చి చేరిన చైనీస్ విప్లవంలోని కమ్యూనిస్టు నాయకత్వదశను ఓం ప్రథమంగా వర్ణించిన వాడు స్నో.

సన్‌యట్ సేన్ జీవితకాలంలో ఇల్లాగే జరిగింది. ఆ పార్టీలోని కేంద్రం వైపుకి బయటినుంచి ఇష్టపూర్తిగా వచ్చి చేరడం అప్పుడూ జరిగింది. అయితే 1930 దశాబ్దపు చివరి భాగంనాటికల్లా తానొక శిష్టకూటమి అన్నట్లుగానూ, అజ్ఞానాంధకారంలోని జన సామాన్యం మీద క్రమబద్ధతనూ విధేయతనూ ప్రయోగించడం తన మహాకర్తవ్యమనీ కొమింటాంగ్, చైనీస్ కమ్యూనిస్టుపార్టీ (కుంగ్ ఛాన్ టాంగ్) ఒకదానితో ఒకటి ముఖాముఖిగా నిలిచి తలపడిన పరిస్థితిని రెండు 'టొటాలిటేరియనిజం'ల మధ్యసాగిన పోటీగా చూపడం, దాన్ని అపసవ్యంగా బోధపరచుకోవడమే. ఆ పోటీ కొమింటాంగ్‌కీ కమ్యూనిస్టు పార్టీకీ మధ్యసాగిన పోటీయే కావచ్చు, కాని నిజానికి తమ ఆధిపత్యాన్ని తదితరులపై రుద్దాలని చూచిన కొమింటాంగ్ నాయకత్వం తనకు తాను ఏర్పడిన కూటమి కమ్యూనిస్టులు కూడా 'గతి తర్క' ఉద్యమ క్రమంలో తమకు తామే ఏర్పడిన కూటమి అయినా, ప్రజల ఇష్టాసక్తినీ మద్దతునీ ఆకర్షించుకోగల సూత్రాలను, పద్ధతులనూ అవలంబించ గోరారు. ఇది ఇలా ఉండగా, ఇంకా స్పష్టమైన ఆకృతిని ధరించకుండా ఉండిన జాతిలోని అసంఖ్యాక ప్రజలు ఆమోదపూర్వకంగా తాము అనుసరించగల నాయకత్వం కోసం గాలిస్తూ వచ్చారు. ఎంచేతంటే ఆ నాయకత్వం తమ స్వీయ ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించగలదు. వాటిని పెంపొందించనూ గలదు. మరి కమ్యూనిస్టు పార్టీలో ఆ నాయకత్వం ప్రత్యక్షమయిందని తమకు గట్టి నమ్మకం ఏర్పడ్డాక ఏటేటికీ అధికాధికంగా వాళ్ళు సంతోషించసాగారు.

నాయకులూ అనుచరులూ ఒకరిపై ఒకరు ప్రభావం జరపుకునే ఉద్యమానికిగల విలక్షణత్వం తాలూకు అనుభూతిని, మరింత స్పృహతోటి, మరిన్ని

వివరాలతోటి, విలియం హింటన్ రాసిన 'ఫాన్ షెన్' ప్రదర్శించింది. చైనీస్ విప్లవం గురించిన రెండవ ప్రామాణిక గ్రంథం ఈ 'ఫాన్ షెన్'. ఉత్తరాది చైనాలో ఒక పరిమిత ప్రాంతంతోనే హింటన్ ప్రమేయం యావత్తూ జపానీ దండయాత్రకు పూర్వం ఈ ప్రాంతానికి సంబంధించిన స్థూలచిత్రాన్ని రచించేందుకు హింటన్ కాలం రీత్యా గతంలోకి వెళ్ళుతాడు. లెక్కలేనంత మంది భూకామందుల వర్గమూ, ప్రత్యేక హక్కులతోటి అధికార దర్పంతోటి విర్రవీగుతూండిన కొమింటాంగ్ భవంతిలో కూలిపోక మిగిలిన భాగమూ, దండయాత్రకారులతో చేతులు కలిపినందుచేత అయత్నంగా సాగిన స్థానిక ప్రతిఘటన ఎలా అంగవైకల్యం పొందిందీ వర్ణిస్తాడు. అపైన ప్రతిఘటనేచ్ఛ ఎలా రెక్కొందీ చర్చిస్తాడు. దూరాన్నుంచి కమ్యూనిస్టు ఎయిత్ రూట్ ఆర్మీ కార్యకర్తలూ ఏజంట్లూ సాగించిన పురోగమనం ఈఇచ్ఛను అధికంగా ప్రజ్వలింపజేసింది. ప్రతిఘటించడం ఎలాగో అనే వాటి విషయమై వార్తలలో కథలా సక్రమ ప్రతిఘటన అంటే ఇలా వాళ్ళు (ఎయిత్ రూట్ ఆర్మీ) సాగించే పద్ధతి ఇది. ఈ నోటినుంచి ఆ నోటికి ఈరైతునుంచి ఆ రైతుకీ పాకిపోసాగిన ఈ 'ఉద్యమం' తన ఉధృత వేగాన్ని తానే సృష్టించుకొంటూవచ్చింది. ఇలాంటి ఉద్యమానికీ, నియంత్రణకూ లోబడిన విప్లవానికీ మధ్యగల భేదాన్ని ఇది సూచిస్తుంది.

విజయం:— స్థానిక జపానీయులు వెనక్కి వెళ్ళిపోతారు. జపానీలంతా లొంగుబాటయ్యారనే కబురు ఎంతో దూరం నుంచి వచ్చి అందుతుంది. జనం తమ వీరత్వం తాలూకు ప్రతిఫలాలను రుచిచూసుకుంటారు.

ఉత్పాతం:— చియాంగ్ కై - షేక్ సేనాబలాలు, భూకామందుల బలగాలూ, కొమింటాంగ్ అధికార స్థానాల్లోని వాళ్ళూ, అధికారస్థానాలను పొందగోరిన వాళ్ళూ అందరూ తిరిగి వచ్చి పడుతారు. ఈ ప్రతిఘటనోద్యమవీరులను వెంటబడి వేటాడుతారు. ఆ వీరులిప్పుడు వీరులుకారు విద్రోహులు.

విమోచన:— అయితే రెండు విషయాలు మారాయి. తమకోసం తాము చేసిన పనుల దృష్ట్యానూ, ఒకరికోసం మరొకరు చేయడం నేర్చినపనుల

దృష్ట్యానూ, తమ వుమ్మడి బాధలూ వుమ్మడి విజయాలూ వీటిదృష్ట్యానూ. రైతాంగంలో గణనీయమైనంత హెచ్చుభాగం గులాంగిరిని తలదాల్చే వెనకటి రైతాంగం మాత్రం కాదు. 'ఎయిత్‌రూట్ ఆర్మీ' ప్రధాన కర్తవ్యం విదేశీ దండయాత్ర కారులకు వ్యతిరేకంగా జాతీయవాద పూరితమైన ప్రతిఘటనను ప్రేరేపించడం మరి ఏ మాత్రం కాదు. సైన్యానికి సైన్యము, 'ఎయిత్‌రూట్' కు తమంతతామై అనుబంధంపొందిన ప్రజాపోరాట కారులూ (పార్టిజాన్లు) గ్రామ ప్రజాపోరాట దళ సభ్యులూ (మిలీషియామెన్) వీళ్ళందరూ ఇప్పుడు తమ భవిష్యత్తును తామే నిర్ణయించుకునే విషయంలో రైతాంగం తనవాణిని వినిపించి తీరాలనే కోరికను బలపరిచేందుకు సుముఖంగా ఉన్నారు. ఈ కోరికలు అనివార్యంగా వర్గయుద్ధానికి దారి తీశాయి. కాబట్టి అంతిమంగా 'విమోచన' అంటే, పాత పార్టీని కిందికి తోసి కొత్త పార్టీని పైకెక్కించడం అనిగాకుండా, ఒక వర్గ వ్యవస్థను సమకూర్చుకుంది.

'ప్రజాతంత్రం' అంటే భిన్న వ్యక్తులకు భిన్నంగా అర్థమౌతుంది గనక రైతులూ (ఇతరులూ) కోరిన కోరికలను "ప్రజాతంత్ర" కోరికలనక పోవడం మంచిది. ఇందులో ఇమిడి ఉన్నదానికి హింటన్ పేర్కొన్న వాస్తవ గాథలలో ఒకగాథ ఉదాహరణప్రాయమైంది. సంగ్రహంగా చెప్పాలి కాబట్టి, హింటన్ చేసిన వర్ణనను నా మాటల్లో చెపుతున్నాను. ఇలా చెయ్యటం మూలంగా ఆయన నిర్దేశించిన అర్థాన్ని వక్రీకరిస్తున్నాననుకోను. తమ కష్టాలగురించి గుండెలు విప్పి చెప్పవలసిందిగా, ఏమేమి చెయ్యాలని తామనుకుంటున్నదీ బయట వెయ్యవలసిందిగా కమ్యూనిస్టులు, జనం ఏం చెబుతూందీ ఏం కోరుతుందీ తమలో తాము చర్చించుకుంటారు-అప్పటి ఆ వూపులో ఆ వుడుకులో జనం కోరుతూన్నదంతా తమ విధానంగా అవలంబించే పక్షంలో ఏమేరకు ఉద్యమాన్ని అది ఎలా విస్తరింపజెయ్యగలదు, ఏమేరకు వ్యతిరేకతను దృఢపరచగలదు? అప్పుడు వాళ్ళు మరిన్ని గ్రామ సమావేశాలను ఏర్పాటుచేసి, తమకు రైతుల కోర్కెల పట్ల స్థూలంగా సానుభూతికద్దని స్పష్టపరుస్తూనే, కొన్ని మార్పులను సూచిస్తారు. ఈ అభిప్రాయాల మార్పిళ్ళు సాగుతూ పోతాయి. కమ్యూనిస్టులు తాము వాంఛించే మార్పులను బలవంతాన రుద్దడమంటూ జరగదు. కొన్ని సందర్భాలలో ప్రజాభీష్టం దృఢంగానూ స్పష్టంగానూ ఉంటే, తమ సూచనలను తామే

సవరించుకుంటారు కూడాను, గ్రామాల్లో సాగుతున్న ఈ చర్చల పర్యవసానం గురించి ఎప్పటికప్పుడు అనేక గ్రామాలు కలసిన ప్రాంతానికి-పైస్థాయికి-తీసుకుపోయి నివేదించడం జరుగుతుంది. అంతూ పొంతూ లేని ఈ మాటల తోటి ముందుకీ వెనక్కీ, కిందికీపైకీ, అభిప్రాయాలను పంపడంతోటి, గ్రామస్థులు విసుగుపడరా అని ఒక ప్రాంతీయ ఉద్యోగిని హింటన్ ఒక మారు ప్రశ్నించాడు. 'వాళ్ళేమీ అలసి విసిగిపోరు. తమ భవిష్యత్తునే తాము నిర్ణయించు కుంటున్నారు గదా!' అని జవాబు.

జాక్ బెల్డన్ ప్రవేశించింది సరిగ్గా ఇప్పుడే, హింటన్ తిరిగి చూచినస్థలాలను తానూ తిరిగి పరిశీలించడం జరిగింది. అయితే దాని పరిధి మరింత పెద్దది. ఈశాన్య భాగం (మంచూరియా), హ్వాయి, యాంగ్జి నదుల పరివాహక ప్రదేశాలలో హింటన్ వర్ణించిన కాలాన్నే బెల్డెన్ వర్ణించాడు. విమోచన యుద్ధం (జపానీ లొంగుబాటు తదనంతరం సాగిన అంతర్యుద్ధం) తోటి, ముఖ్యంగా అతని ప్రమేయం అయితే గతానికి సంబంధించిన అనేక రిఫరెన్సులు, ఇతర ప్రాంతాల విముక్తి యుద్ధక్రమం కూడా ఇందులో చేరుతాయి. కాబట్టి బెల్డేన్ కథనం హింటన్ కథనం కంటె శాఖోపశాఖలుగా విస్తరిస్తుంది. కాని పరిమిత ప్రాంతాలకు చెందిన ప్రగాఢమైన వర్ణనలు, స్థానిక ఘటనలూ బెల్డెన్ గ్రంథలో ఉన్నాయి. అయితే హింటన్ రచనలో లాగా, ఒక ప్రత్యేక ప్రాంత కేంద్రంగా సుదీర్ఘమైన ఆసక్తి కలిగే విధంగా, బెల్డెన్ రచన సాగదు. ఎటొచ్చీ బెల్డెన్ ప్రాతికేయుడు, తాను పరిశీలిస్తున్నాడుగాని సహాయపడడం లేదు. పాల్గొనడంలేదు. 'జనసామాన్యం' పాత వ్యవస్థను తలకిందులచేసి, వ్యక్తి పరివర్తనపొందే విలక్షణమైన క్రమం, 'ఫాన్ షెన్'లో పాల్గొనేందుకూ, దాన్ని పెంపొందించేందుకూ, గ్రామసీమలకు పంపబడిన విద్యార్థులతోటీ కేడర్లతోటీ హింటన్ కలసి పనిచేశాడు. తన సహచరులతోటీ గ్రామీణ జనంతోటీ అతి సన్నిహితంగా మమేకమయ్యాడు

స్నో, హింటన్‌ల అనుభవానికీ బెల్డెన్ అనుభవానికీ ఒక విషయంలో భేదం ఉంది. అరాజకంలో లోతులకు దిగిపోతూ, అధికారవాదతత్వంతో కూడిన చియాంగ్‌కై- షేక్ అదుపు తప్పిపోసాగిన 1947-8-9లలో, పూర్తిగా కమ్యూనిస్టు (ఎయిత్‌రూట్ ఆర్మీ) అధీనంలోని ప్రాంతాలకూ, అధికారం ద్వారా

గాకుండా పలుకుబడి ద్వారా ప్రజాపోరాటకారుల జనసేన మనుషుల అదుపులో ఉండిన ప్రాంతాలకూ, కొమింటాంగ్ ప్రాంతాలకూ మధ్య, ఇటునుంచి అటూ అటునుంచి ఇటూ, అమెరికన్ పత్రికా రిపోర్టర్లు చల్లగా పోయి చాటుగా రాగలిగే వారు. ఈ అవకాశాన్ని బెల్డెన్ వాడుకున్నాడు. అమెరికా నుంచి వచ్చిన, వస్తుందని ఆశించిన సహాయం మీద కొమింగ్‌టాంగ్ ఎంత ఆధారపడిందంటే, తమకు అపనమ్మకం ఉన్నప్పుడు కూడా రిపోర్టర్ల పర్యటనను కొంతవరకు మాత్రమే పరిమితం చెయ్యగలిగేది. కమ్యూనిస్టులు రిపోర్టర్లను పరమ ఉదారంగా చూసేవాళ్ళు. తమ ఆత్మ విశ్వాసానికీ, తమ ఆశయం పట్ల గల విశ్వాసానికీ కొమింటాంగ్ మరణ వేదనవల్ల క్షోభపడిపోసాగిన ప్రాంతాలలో ఆ రిపోర్టర్లు చూసేదాని విషయాలలో కంటే యుద్ధ ప్రాంతాలలో చూసే దాని విషయంలోనే సాధారణ అమెరికన్ ఎవడైనా మరింత సానుభూతి చూపక తప్పదనే వాళ్ళ తెలివైన అవగాహనకూ, సదరు ఉదారవైఖరి అసాధారణమైన దాఖలా.

'చైనా పై అరుణతార' చాలా కాలం కిందటే ప్రసిద్ధమైన ప్రామాణిక గ్రంథం. 'ఫాన్ షెన్' కూడా తిరుగులేని ప్రామాణిక గ్రంథమే. ఆ కాలానికి సంబంధించిన మావో ఆలోచనా విధానాన్ని వివరించడంతో, ప్రజల సమావేశాల ముందుకు పార్టీ కేడర్లనూ నాయకులనూ పిలిచి, వారి విధానాలు, పని పాటలగురించి మాత్రమే గాక, వారి వ్యక్తిగత జీవితము, నిజాయితీ గురించి కూడా నిలడీసి విమర్శించడాన్ని ప్రోత్సహించే పద్ధతితోసహా, మావోపని పద్ధతిని యావత్తూ దర్పణం చూపిన ఒక ఉత్తమ గ్రంథం అదిఅని నేనను కుంటున్నాను. ఈ రెంటి నడుమ "ప్రపంచాన్నే కుదిపేసిన చైనా"(China shakes the world) నేటివరకూ నిరాదరణపాత్రైన ఒక మహత్తర గ్రంథం. ఎందుకిలా జరిగింది? ఏమిటికారణం?

జపానుచే మంచూరియా ఆక్రమణ- ఇటలీచే ఎథియోపియా దండయాత్ర, స్పానిష్ అంతర్యుద్ధం చైనాలో మళ్ళీ జపాను దురాక్రమణ, మ్యూనిక్, వీటన్నిటితో వ్యథాభరితమైన దశాబ్దం అంతమవుతున్న తరుణంలో ప్రచురింప బడింది. 'అరుణతార.' ఈ ప్రాంతీయ దురాక్రమణల ఫలితాలు అనూహ్యమైన విస్తృత భీతావహమూ బాధలతో గూడిన ప్రపంచయుద్ధం వైపుకి స్పష్టంగా గుమికూడుతూ

వచ్చాయి. ఫాసిజానికీ మిలిటరిజానికీ వ్యతిరేకంగా సమీకరించ దగిన శక్తులు ఏమిటేమిటి? కమ్యూనిస్టు ప్రపంచ ప్రమాదం గురించి వర్ణించే జర్మన్, ఇటాలియన్, జపానీ ప్రచారం మూలంగా, మితవాదులూ, లెక్కలేనంత మంది మోడరేట్లూ, లిబరల్సూ స్తంభించి పోయారు. బోల్షివిజం అనే 'ఎర్రతరంగం'ను ఫాసిస్టులూ, మిలిటరిస్టులూ నిజంగానే ముందుకి రానీయకుండా నిలిపివేస్తున్నారేమో ననుకుంటూ తటపటాయిస్తూ ముక్కుమీద వేలేసుకుంటూ ఉండేవారు. హఠాత్తుగా స్నో ఒక కమ్యూనిస్టు ఉద్యమాన్ని చూపెట్టాడు. కమ్యూనిస్టేతరులు అసంఖ్యాకంగా కలిసివచ్చిన కమ్యూనిస్టు ఉద్యమం సిద్ధాంత ఏకాంతంపాలై ఒక మూలకు చేరుకోని కమ్యూనిస్టు ఉద్యమం. అంగరక్షకులు లేకుండానే ఏనాన్ వీథుల్లో సంచరిస్తూ వచ్చిన నాయకులుగల కమ్యూనిస్టు ఉద్యమం; జాతీయ ఐక్యత పేరిట తమ పరమ కర్కోటక విరోధి అయిన చియాంగ్ కై- షేక్ ప్రాణాన్ని కాపాడిన నాయకులుగల కమ్యూనిస్టు ఉద్యమం. అంతర్జాతీయ దురాక్రమణకు వ్యతిరేకంగా కమ్యూనిస్టులు ఆమోదయోగ్యులైన మిత్రులుగా కలిసిరాగల ఐక్యసంఘటనకు అనుకూలంగా, అమెరికన్ ప్రజాభిప్రాయాన్నే ఏమి, యావత్ ప్రపంచ ప్రజాభిప్రాయాన్నే సిద్ధం చెయ్యడంలో స్నో నిర్వహించిన పాత్ర, ఇప్పుడు వెనుదిరిగి చూస్తే ప్రపంచ చారిత్రక ప్రాధాన్యం కలిగినదని స్పష్టమౌతుంది.

'ఫాన్ షెన్'లో వర్ణితమైన కాలం బాగా వెనక్కు జరిగాకే అది ప్రకటింపబడింది. హింటన్ 1953లో అమెరికాకు తిరిగి వచ్చాడు. సెనేటర్ జో మెకార్థీ సెనేటర్ పాట్ మేకరాన్‌ల సెనేటు ఆంతరంగిక భద్రతా కమిటీ ప్రభావం అమెరికాపై దుర్భరంగా పడిన రోజులు. హింటన్ కాగితాలను స్వాధీనం చేసుకున్నారు. వాటిని విడిపించుకునేందుకు ఎంతో ఖర్చుతోగూడిన వ్యాజ్యం కొన్నేళ్ళదాకా నడిచింది 1967దాకా 'ఫాన్ షెన్' అచ్చు పడలేదంటే కారణం ఇదే. ఆనాటికి మెకార్థీ మెక్కరానిజమ్ కరుకు దగ్గి పోతూంది (ఇప్పటికీ అది పూర్తిగా అంతరించలేదు). 'ఫాన్ షెన్' ను చదివేకొత్తతరం ఎదిగి వచ్చింది. చదివాక, అదికొన్ని సంకటప్రాయమైన ప్రశ్నలు లేవనెత్తింది. "చైనాలో యదార్థంగా జరుగుతూ వచ్చినదాన్ని 'ఫాన్ షెన్' నిజంగానే వర్ణించిందనుకుంటే, అదే కాలంలోనే, మాస్కో నియంతృత్వం ఆధ్వర్యాన

భీతావహ పద్ధతులతో చైనా తలపై కమ్యూనిజాన్ని రుద్దుతున్నారని చెప్పే కట్టు కథలను అమెరికా నోటికి ఎందుచేత అందించవలసివచ్చింది? జనం ఈ కథలను ఎందుచేత నమ్మారు? ఈ ప్రశ్నలకు ఏమిటి జవాబు?''

'ప్రపంచాన్నే కుదిపేసిన చైనా' గ్రంథమే కొంతవరకు జవాబు. ప్రచురింపబడినప్పుడు అది అద్భుతంగా అమ్ముడు పోలేదనే సంగతీ, ఆ తర్వాత గూడా అది నిరాదరణపాలైన ఉత్తమగ్రంథంగా ఉండిపోయిందనే సంగతీ, జవాబుకు సంబంధించిన సంగతులే. తాను వర్ణించిన సంఘటనల ప్రత్యేక సాక్షి లాంటి రిపోర్టరుగాని హింటన్‌లా గాక, జాక్ బెల్డెన్ ఒక వర్కింగ్ రిపోర్టరుగా ఉండి తన గ్రంథం రచించాడు. అంతేకాదు మెకార్థీ మెకగ్రాన్ కాలమేఘంగా పరిణమించబోయే 'చైనాలాబీ' అమెరికా ఆకాశతలాన్ని మలినం చేయడం ప్రారంభమైన రోజుల్లో, అతను రిపోర్టరు. తాను అమెరికాకు పంపిన కొన్ని రిపోర్టులలో ఒక్క అక్షరమైనా అచ్చుకాలేదని అనేక పర్యాయాలు బెల్డెన్ రాస్తాడు. కీ॥ శే॥ సెనేటర్ నోలాండ్ (రిపబ్లికన్, కేలిఫోర్నియా) కీ॥ శే॥ విలియంసి-బుల్లిట్‌లు, చైనా ఘటనల గురించి పరమ వికృతమైన తప్పుడు కథనం చేసేవారన్న విషయాన్ని కూడా బెల్డెన్ పేర్కొంటాడు.

నేటి సమయంలో, వియత్నాం యుద్ధసమయంలో, ఎడ్గార్‌స్నోనో విలియం హింటన్‌నో చదివేకంటే జాక్ బెల్డెన్‌ను చదవడం ముఖ్యమౌతున్నదంటే, అతని రచనలోగల పై విశేషమే కారణం. చైనాలో అమెరికన్ రాజకీయ, సైనిక మహాసంస్థలు చేసిన మతిమాలిన, అనవసరమైన పొరబాట్లే వియత్నామ్‌లో మళ్ళీ చేయబడ్డాయి, చేయబడుతున్నాయనే అంశాన్ని ఈగ్రంథంలో ప్రతిపేజీ కూడా గుర్తుకు తెస్తుంది.

ఈ పొరపాట్లను, అక్షరం అక్షరం విడదీసి ఎన్ని దఫాలిట్లా పేర్కొవాలి? ఏమి జరుగుతూందో, ఏమి తప్పు జరుగుతూందో, నిరంకుశాధికారులకూ లోగడ జరిగిన ఘటనలకూ బందీలై నిర్దిష్ట ప్రవర్తనానియమాలకు అధీనులై ఉన్నపాలకులకంటే, అమెరికన్ ప్రజలకే ఎక్కువ తెలుసు. ప్రభుత్వం మీద ప్రజలనుంచి మరింత ఒత్తిడి అనే బుల్‌డోజర్ మూలంగానే ఈ గండిని పూడ్చగలం. ఏమి చెయ్యాలో తెలుసుకోగోరే వాళ్ళకు, చాలాకాలం క్రితం, ఎంతో

దూరాన, చైనాలో ఏమిజరిగిందో వర్ణించే బెల్డెన్ పుస్తకం ఎంతో పనికివస్తుంది. గతకాలానికి చెందిన వలస వారసత్వం చేతులకు సంకెలకాగా, ఇరవయ్యో శతాబ్దంలో కాలిపట్టు సంపాదించుకో జూస్తున్న ఏ ఆసియన్ సమాజానికైనా ఎదురయ్యే సమస్యల గురించి, ఈ పుస్తకం స్థూలంగా, వర్ణిస్తుంది. అంతకంటే మిన్నగా ఈ పుస్తకం ప్రదర్శించే విషయం ఏమిటంటే, సామ్రాజ్యవాద దుర్భావాలలో కళ్ళు మూసుకుపోయిన ఒకానొక సమాజం, వాస్తవ విషయాలను వాస్తవ విషయాలుగా పోల్చుకోగలిగిన పరిపాలననే డెమోక్రాటిక్ పార్టీ పాలన గానీ రిపబ్లికన్ పార్టీపాలనగానీ-ఏర్పాటు చేసుకోలేదు అవాస్తవ విషయాలను పట్టించు కోవడం సరేసరి.

— ఓవెన్ లేటిమోర్

లీడ్స్ విశ్వవిద్యాలయం జనవరి 1970

*పరిచయం :*

# రేపటి సూర్యుని "కిరణాలు"

"ప్రజల కోసం మరణం-హిమాలయాల కంటె ఘనం" [మావో] అనుకొని అమరవీరులైన వారిపై రాసిన సంస్మరణ గేయాలు పదకొండిటి సంకలనం- 'కిరణాలు'. భూమయ్య, కిష్టాగౌడు, పరిటాల శ్రీరాములు, కరణం నాగారాజరావు, నీలం రామచంద్రయ్య జంపాల చంద్రశేఖర ప్రసాద్, సూరపనేని జనార్దనరావులు గేయ నాయకులు. శ్రీశ్రీ. కె. వి. రమణారెడ్డి శివసాగర్, చెరబండరాజు, యన్ కె., మల్లయ్య, పి. పెద్దారెడ్డి వై. కాశీపతి, జి హనుమంతరెడ్డి, వరవరరావులు గేయగాయకులు. పాడుకొని, ఆవేశమూ, ఆలోచనలు తెచ్చుకోను-పనికి వచ్చే పాటలు. —జీ.డి.

---

"కిరణాలు"

కూర్పు: కె. వి. రమణారెడ్డి

ప్రచురణ: వి.ర సం. వెల: ఒక రూపాయి.

కాపీలకు: 1. సృజన, హనుమకొండ, 506 001.

2 కె వి రమణారెడ్డి 10-6-27, కావలి-524201

---

# భాషా భేదం లేని ధిక్కార గీతాలు

దేశం ఆపదలో వున్నప్పుడు కవులు ప్రేమగీతాలు రాసుకుంటూ కూర్చోరు; ఆపదను అద్భుతం అని వర్ణిస్తూ గానం చేయరు "ఏదో- కర్మ- ఏం చేస్తాంలే- యిది కొన్నాళ్ళు"— అని ఏడుస్తూ పడి వుండరు. అతీతమైన తమ అసమ్మతినీ, తమ భావాలనూ— "కన్నీళ్ళ సిరాతో" "ఈ వెలుగా మలుస్తారు," ప్రతిఘటిస్తారు.

ఏడు భాషల్లో వెలువడిన ధిక్కార గీతాలు యిరవై మూడింటిని ఇంగ్లీష్ లోకి అనువదించి— పౌరహక్కుల పరిరక్షణ ప్రజా సమితి (P.U.C L.) ఢిల్లీ విభాగం వారు 'Dissenting Voices" (అసమ్మతి కంఠాలు) అనే చిన్న పుస్తకం ప్రచురించారు. వీళ్ళ కృషి అభినందనీయం.

"విచారణ లేకుండా జైళ్ళలో ఒక్కడైనా వున్నంత వరకు- విచారణ పేరిట న్యాయం గేలిచేయబడున్నంత కాలం- నక్కలూ తోడేళ్ళూ ఒక్కటైతేనేం పీక్కుతింటున్నప్పుడు— ఈ దేశంలో ప్రజాస్వామ్య ముందని భ్రమ పడకు. చదువు, సభ్యత, సంస్కారం వున్నాయంటే నమ్మకు మనిషినీ, మానవత్వాన్ని అవమానించడం సహించకు"

అని— బిరేంద్ర చటోపాధ్యాయ (బెంగాలీ) అంటే—

"నిరీక్షణ ఒక శత్రువు
దానిని నమ్మకు."
"నిరీక్షణ నుంచి నిన్ను నువు రక్షించుకో
ఏది కావాలో యిప్పుడే చేజిక్కించుకో
ఏం చేయాలో ఈ క్షణాన చేయి"—

అంటాడు సర్వేశ్వర్ దయాళ్ సక్సేనా (హిందీ) ఈయనే మరో కవితలో—

ఆలోచనకు సమయం లేదు

నడవడం కాదు.
వడిగా పరుగెత్తు."
నీ చేతిలో జెండా ఏదీ లేదని నాకు తెలుసు
అసహాయుడైన ఆకలి మనిషికి
అక్కరలేదు జెండా ఏదీ"
నిన్న వ్యాగన్‌ను ఒంటరిగా లూటీచేస్తూ చంపబడ్డ నీ అన్న
రక్తసిక్త చొక్కా పేలికను పట్టుకో."
"కలిసికట్టుగా పరిగెత్తు
ఆలస్యం చేస్తే బండి పోతుంది
గుడిసెలో

పిల్లలు, ముదుసలుల శవాలే నిండిపోతాయి"—
అంటాడు. "ఆయుధాలతో కాదు: ఆత్మ విశ్వాసం, ధైర్యం, వేగంతోనేగదా పాములను చంపేది?" అని అడుగుతాడు.

"సూర్యనగర 'ఖలీఫా' ను సవాలుచేస్తూ
నేను ముందుకు పోతాను
నా కళ్ళల్లో, నా శరీరంనిండా
అసంతృప్తి అంత్యక్రియల మంటలు -
దేవుని హృదయం పాతిపెట్టబడ్డ దిక్కుగా
నేను పోతున్నాను."
"బాటలూ, గ్రహాలూ, మజిలీలూ దాటి
నేను పోతున్నాను ముందుకు."
"నా కళ్ళల్లో లావా కన్నీళ్ళ వరద
నా గుండెలో ఏడ్పుల అలల బాధ
పట్టులో నా చేతులు
మూగ నినాదాల విషపు వేదనలతో నా కంఠం
నా నుదుట- అణచబడజాలని తిరుగుబాటు ఎర్రజెండా.
మానవత్వం మంటకలిస్తే
ఈ సృష్టికి కారకుడైన దుష్టుడెవడు?
[వాడు చావవలసిందే!]"—

అంటూ- రవీంద్రసింగ్ (ఒరియా) "ఊరేగింపు" లో ముందుకు పోతూ కనిపిస్తాడు

"తూర్పున-
గెరిల్లా తుఫాను సైనికులను వ్యూహంలోకి నడిపిన-
పీడక దుర్గం క్రింద నలిగిన శ్రమజీవి చేతుల్లోని ఆయుధం."
''అతను తిరుగుబాటు పాట రగిల్చాడు
స్వేచ్ఛను పాడే పావురం ఎగరేసాడు''--

అంటూ- 'బొలీవియా అడవుల్లో 'నిద్రపోని' 'ఎరుపు'ను గుర్తుకు తెస్తాడు అగ్రగామి [ఒరియా].

వంట చేస్తున్న తల్లినడుం వంగిపోయింది;
పార్ట్-టైం వుద్యోగాల కోసం
పత్రికలు చూస్తున్నాడు రిటైరయిన తండ్రి;''
"చెల్లెలు కళ్ళ క్రింద నల్లని గీతలు;"
"తప్పించుకుపోయిన తమ్ముని కోసం
ఇంటి చుట్టూ పోలీసులు;
చిన్న గదిని చిందరవందర చేశారు;
అల్లరి ఏమిటో తెలుసుకునేందుకైనా
పొరుగిండ్ల కిటికీలు తెరుచుకోలేదు,''
"పరీక్ష హాల్లో చెప్పారు:
చెట్టుకు కట్టి కాజల్‌ను చంపారు.
.........
తల్లీ తండ్రీ ఏడవలేదు
కాని కాజల్ తమ్ముడు పళ్ళు కొరికాడు
నెల తర్వాత జాబు రాసి పోయాడు:-
'కాజల్ పని పూర్తి చేయపోతున్నా-దీవించండి;'
'ప్రొఫెసర్ భట్టాచార్య మామూలుగా లేడు
చిత్రహింసలూ, బాధలూ ఆయన్ను అవిటిని చేసాయి
పాదాలను విరిచి, మణికట్టును ముక్కలు చేసారు
కళ్ళు సరిగా చూడలేకపోతున్నాయి
నాలుక నోటి కప్పుకు అతుక్కుంది,

నేరం? రాజద్రోహం"
"నీపాటలో, నీ ఆటలో
రాజద్రోహం,
నువ్వూ నేను, నువ్వూ నువ్వూ నువ్వూ మీరూ కలిస్తే
రాజద్రోహం
ఈ దేశంలో బ్రతకడమే
రాజద్రోహం "—

అనే ధ్రువసేన గుప్త [బెంగాలీ] ఆవేదన, చెరబండరాజు [తెలుగు] 'పునర్జన్మ' లోను కనిపిస్తుంది:-

నా నీడలో నా భావాల వేడిన్ని అనుమానించి
తుదకంటా నాశనం చెయ్యాలని
నన్ను వెన్నంటే నడుస్తుంటారు పోలీసులు."
"నాకు నోరుండడం నేరం
నేను ఆలోచించడం అరాచకం"

చెరబండరాజు, చివర చెప్పిన మాటలు విప్లవకారుల దృఢ దీక్షను తెలియజేస్తాయి:-

బొట్టు బొట్టుగా నా నెత్తుటిని
ఈ నేల విముక్తి కోసం విత్తనంగా చల్లుతాను
బందీనైనా బానిసను కాను
నన్ను కదిపినా ఖండించినా
మళ్ళీ మళ్ళీ అలలా పుట్టుకొస్తూనే వుంటాను."

ఇదే భావన నవరాజ్ మోడి (ఇంగ్లీష్) కవితలోను కన్పిస్తుంది:-

ఎవరినైతే వాళ్ళు మాటి మాటికి చంపుతారో
మన చెల్లెళ్ళ శరీరాల నుంచి
వాళ్ళు లక్షల సార్లు మళ్ళీ పుష్పిస్తారు
తాము ఎవరో తెలుసుకున్న వాళ్ళ చంద్రుళ్ళను
తుపాకులు కదపలేవు."

పోలీసులను గురించి "రక్తస్వప్నం" లో వరవరరావు(తెలుగు)

"దోపిడీ వ్యవస్థను, కడుపుడుకుతున్నా

డ్రెస్‌లో బందీలై కాపాడుతున్న పోలీసులు."
"జీతం రాళ్ళ కొరకు పట్టిన తుపాకీకి
జీవిత సత్యాల ముందర పేలే దమ్ములేక సిగ్గుపడుతున్నది."
శిక్షల ననుభవిస్తూ కూడా పర్వతం లాంటి విశ్వాసం ప్రక్కన కూర్చున్నవాడు రాజీకి రాడు. ముద్రారాక్షస [హిందీ] చెప్తున్నాడు:
"రాజీ అన్న మాటే తప్పనిసరియై బెదిరిస్తే
జెండాలా నా చేయి ఎత్తి
మోకాళ్ళ లోతుగావున్న ఈ
మురికినీ, బురదనూ ఎదుర్కొంటాను.
చూడు:
నా చేయి మండడం మొదలయింది యిపుడు!"
చట్ట వ్యతిరేక విషయాల గురించి నేనేమీ చెప్పను"—అంటూ వసంత్ అబ్జి దహాకే (మరాఠి) తన వుత్తరాలు సెన్సార్ చేయడం, తనమీద కుట్ర పన్నడం, తన యింటిలోకి వెలుగుని రానీయక పోవడం-గురించి చెప్పి-యిదంతా జరిగిననాడు—
"అన్ని చట్టాలూ చట్టవ్యతిరేక మంటాను
ఎందుకంటే—
నా సమ్మతి లేకుండానే
ఈచట్టాలు చేయబడ్డాయి"—
అని ఎదురు తిరుగుతాడు.

జైల్లో హోచిమిన్ అనుభవించిన ఆవేదనే అమృత్‌సర్ జైలో కూర్చుని అమర్ జిత్ చందన్ (పంజాబీ) కూడా అనుభవించాడు:—
"చిన్నా పెద్దా పనుల్లో
ఎంత మునిగి వుండేవాడిని ఒకప్పుడు!"
"ఇప్పుడు"
"ఏమిటీ అర్థంలేని నిర్వ్యాపారత?"
అలీపూర్ సెంట్రల్ జైల్లో దేబబ్రిత భట్టాచార్యకు [బెంగాలీ] అబ్దుల్ సయీద్ కలిసాడు. ఒకరికి జీవితంలో పక్కటెముకలు మాత్రమే మిగిలితే, మరొకరికి జైలు సెల్ లోని మూడడుగుల నేలా,

సర్కారీ భోజనం మిగిలాయి. అందుకే యిద్దరి చేతులూ కామ్రేడ్ అన్న మాటతో కలిసాయి. ఈ కలయిక శ్రమజీవుల కలయిక పోరాట శక్తుల ఐక్యత.

ప్రజలను పీడించి చంపితే చంపారు
కాని, అమ్మో!
దీన్ని ప్రజాస్వామ్య మంటారేమిటి?—

అని టంకశాల అశోక్ (తెలుగు) అడుగుతున్న వేళ—

"అంతం లేని రాత్రి:
కుండల్లో బియ్యం లేవు
కళ్ళల్లో కన్నీళ్ళ
హృదయంలో వేదన:
అమ్మను ఎలా కాపాడను?
యింకా ఎంతోసేపు వుండలేను.
ప్రజలు మార్చ్ చేస్తుంటే
పర్వతాలు వణుకుతున్నయ్
సంపన్నుల గడీలు కూలుతున్నయ్.
అమ్మా! నన్నాపకు,
సూర్యుణ్ణి నిద్ర లేపడానికి
నేను కూడా వెళ్ళి తీరాలి"--

అంటూ మిడ్నపూర్ జైల్లో రాజకీయ ఖైదీలు పాడుకుంటున్నారు.. పోరాటంలో అమరులైన వాళ్ళకోసం శ్మశానంలో వెతుకుతున్న తల్లిని చూసి శివసాగర్ [తెలుగు] వాళ్ళంతా ప్రజల్లో కలిసిపో యారు—అని చెప్తున్నాడు.

అడవీ!
నీ చల్లని కనురెప్పల పందిళ్ళ కింద
నా వాళ్ళు సేద దీరారు
నీ కొమ్మలే, నీ ఆకులే
నీ గాలులే సాక్షిగా
నా వాళ్ళు ఒరిగిపోయారు.

విల్లములూ, తుపాకులూ
జారవిడిచారు.
అడవీ; నా అడవీ!
ఆ బాణాలు చేరివుంచు
ఆ ఆయుదాలు దాచి వుంచు.
నీ తోడు అడవీ!
ఈ దేశాన్ని,
ప్లాస్టిక్ బ్యాలెట్ పూల ఉద్యాన వనాల నుంచి
కాపాడ డానికి
ఏదో ఒకనాడు
నేను నీ సాయమే కోరతాను" ఇ వా: [తెలుగు] అంటున్నాడు—

'ఎర్రసైకిల్' గంట మ్రోగించినందుకు పోలీసుల చేజిక్కిన బాలుడు [సర్వేశర్ దయాల్ సక్సేనా: హిందీ] ఆ పిల్లవానికి విప్లవ మంటే ఏమిటో తెలియదు; ప్రజాస్వామ్య మంటే ఏమిటో తెలియదు; సైకిల్ గంట మ్రోగిస్తే నేరమెట్లా అవుతుందన్న ఆలోచన మాత్రం వున్నది. ఆ ఆలోచనే అతన్ని నడిపిస్తుంది. తన స్వేచ్ఛను తుదముట్టింపజూసే బలగాన్ని ధిక్కరిస్తుంది. ఎదిరిస్తుంది.

—జీ.డి.

---

"Dissenting Voices" (1977)

Published by People's Union of Civil Liberties & Democratic Rights (Delhi State)

---

# 'తూర్పు' రచయితల వర్క్‌షాప్ 'మార్పు'

'యువ రచయితల్లో కత్తుల వంటి సాహిత్యాన్ని మలచడం కోసం రచయితల వర్క్ షాప్‌గా' వెలసినామంటున్న 'ప్రజాసాహితి' సాహితీ సంస్థ ప్రచురిస్తున్న కర పత్రికలు మార్పుకోరుతున్నాయి. 'మాకున్నది ఒకేఒక అభిప్రాయం-ఈవ్యవస్థ లోపభూయిష్ఠమని, సాహిత్యం దగాపడ్డ తమ్ముళ్ళకు దగ్గరి బంధువని; మాకున్నది ఒకే ఒక ఆశయం-నూతనత్వం, పరిపక్వత'—అంటున్నారు నిర్వాహకులు. 'వర్గ దృక్పథంతో, సామాజిక చైతన్యంతో సమ సమాజ నిర్మాణం'జరుగుతుందని నమ్ముతున్నారు.

మొదటి కర పత్రికలో శ్రీశ్రీ ని పట్టుకొని 'ఇన్నేళ్ళు నీ కలం పోరాటంలో అలసిపోయావా యుగకవీ! అలసిపోతే చలంలా నిద్రపో. కాని శతృపక్షంతో చేతులు కలపవద్దు'-నిజమే. రెండో కరపత్రికలో 'కాకా పయోనిధి'అయిన దాశరధిని పట్టుకొని తిడుతూ 'దిగంబర కవు'లను గుర్తుకు తెచ్చారు: 'కూలిపోతున్న రాచరికపు బురుజులను భావప్రచారం ద్వారా నిలబెట్టడం ఆయన (ఆస్థానకవి) కర్తవ్యం'

'అట్టలు చించితే అన్నీ ఒక్కటే' అనిపించే మాస (మూస) గర్భిణీ పత్రికలు' నెలకన్నాముందే రావడం-'నెలలు నిండక ముందే పుట్టిన పిల్లల్లా అస్తవ్యస్తంగా వుంటున్నా'యనడం నిజమే. 'సినిమా రొంపిలో ఈదులాడుతున్న' 'ప్రముఖ అభ్యుదయ కవులంతా పాములపై, పతిభక్తురాండ్రపై, వయ్యారి జవరాండ్ర అంగాంగాల ఝుళిపింపులపై కారు కవితలు కక్కేస్తే' అంటూ విశాఖ విద్యార్థుల కరపత్రాన్ని [1970] గుర్తుకు తెస్తున్నారు.

చిన్న కవితలు చప్పగా లేకున్నా, పాలమూరి లేబర్ పాటల లాంటివే ఎక్కువ ప్రచారం జరగాలి. 'స్వాతంత్రం వచ్చిందట...

...ఉర్కి రాండి, ఉర్కి రాండి' చక్కని ప్రయోగం:—

[సొతంత్రం] 'వచ్చిందాల్సెం ఉన్నోళ్ళు బుడుక్కున
బుర్క లేసుకున్నరంట:
మనకు యాడాదికో దినం గిట్ల చూపిస్తరంట.'
'ఈ జెండా కిందనే- ఈ ధర్మసెక్రం కిందనే
మన దొరోళ్ళు- మనల కాల్చుక తినేది'
'సర్కారు మారిన్నాటి నుంచే-
సావుకారి దుకనంల ధరలింకా పెర్గవట్టె
గదేం మాట-మాట్లాడక కుండి
వాళ్ళే-మనసులు మార్చుకోని దించుతరంట'—

అనడంలో సామాన్యుని కందే అర్థమూ, వ్యంగ్యమూ యిచ్చాడు 'సామాన్యుడు'.

'కళావేత్తలారా! మీరెటువైపు?' అంటూ ప్రశ్నించే 'మార్పు' కార్యకర్తలు "ఈ దేశాన్ని గురించి పాడలేను" అని తిలక్‌లా నైరాశ్యం ప్రకటిస్తే ఎట్లా? శ్రీశ్రీ పై చర్చ బాగానేవుంది; కాని "శ్రీశ్రీని విమర్శించే అధికారం నా దృష్టిలో అందరికీ లేదు. శ్రీశ్రీ నీడలో నేటి సాహిత్యం జీవిస్తోంది" లాంటి వ్యక్తిపూజ వుత్తరాలను పెద్దఅక్షరాలల్లో, బాక్స్‌కట్టి వేస్తే అది 'మార్పు' అభిప్రాయం కూడానా?- అయితే 'శ్రీశ్రీకి గుడ్‌బై' నుంచి "వెల్‌కమ్" కు మార్పు వచ్చినట్లా?.

'దేశభాష లందు తెలుగు లెస్సా?'కు ఒక పేజీ కేటాయించడం అన్యాయం. అచ్చు తప్పుల దగ్గరా, పదాల విరుపుల దగ్గరా, కొటేషన్లు సరిగ్గా యివ్వడంలోనూ-తీసుకునే జాగ్రత్తలో 'మార్పు' రావాలి.

—జీ.డి.

---

"మార్పు" కరపత్రికలు (జూలై, సెప్టెంబర్ '77)
మొదటిది: పది పైసలు, రెండోది: పావలా
కాపీలకు: ప్రజాసాహితి, 1-4-168
న్యూటౌన్, మహబూబ్ నగర్ 509 001

# సమర తిమిర కవి 'అల్పమైన కృషి'

'తిమిరంతో సమరం' అనే కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు పొందిన కవితా సంపుటి, "దురంతమైన తిమిరంలో అనంతమైన సమరం" అని తానే వర్ణించారు 'కళాప్రపూర్ణ' దాశరథి. తిమిరం మూఢత్వానికీ మూర్ఖత్వానికీ, తిరోగమనానికి ప్రతీక, ఈ తిమిరంతో సమరం చేసే సైనికునికి కవి ప్రతీక అని తానే వివరణ ఇచ్చాడు. "విజ్ఞానానికీ, అజ్ఞానానికి జరిగే హోరాహోరీ పోరాటంలో మేధావి వర్గానికి చెందిన ప్రతివ్యక్తీ సైనికుడై పాల్గొనకమానడు' "అన్యాయాన్ని అక్రమాన్ని యెక్కడ, యెవ్వరు యెదిరించినా. వారిని బలపరుస్తాను"- చాలా గొప్ప ప్రకటనలు. ప్రకటనలుగానే చాలా గొప్పవన్న మాట.'

ప్రపంచ శాంతి, ఆంధ్ర సమైక్యత, దేశాంతర పీడిత ప్రజాపోరాటాలు, జాతీయోద్యమాలు, ఇలాంటివన్నీ తక్కువైన విషయాలని ఎవరూ అనరు. అయితే, వాటిని దర్శించే కవి తన దురవగాహన వల్లనో అవగాహనాలోపం వల్లనో వాటికి తక్కువ దనం కలిగించగలడు. దాశరథి చేసిందిదే. యుద్ధమూ శాంతీ వంటివి హృదయ భావాలకు (సెంటిమెంట్సు) మాత్రమే సంబంధించిన పదార్థాలుకావు. వాటికిగల ఆర్థికమైన మూలాలు, రాజకీయమైన రూపాలు సరిగా బోధపడనప్పుడు మాత్రమే అవి హృదయ భావాల స్థాయికి దిగజారి పోతాయి. క్రీస్తునీ బుద్ధుణీ గాంధీనీ ఈ పద్మవ్యూహంలోకి ఈడ్చితెచ్చి,శాంతి సూత్రాలను చెప్పించినంత మాత్రాన, తొలగిపోయ్యేవా ఈ అంతర్జాతీయ రాజకీయపరిణామాలు? రజస్తమో గుణాలను విడిచి సత్వ గుణాన్ని రాబిలిస్తేనా చాలా? శమదమాల అమృతంలో క్షమ విరుస్తుందట. అంత క్షమ ఉన్నప్పుడు మరి పోరాటాలెందుకు?

రక్త వాదాలు లేకుండా
రక్త పాతాలు రాకుండా

మానవాళికి 'ముక్తిగీతం' హృదయ వాదికి మాత్రమే సాధ్యం.

హృదయాలలో నుండి ఎదగాలి క్రాంతి

నయనాలలోనుంచి నవ్వాలి కాంతి

అంతేగాని జెండాలూ సిద్ధాంతాలూ వగైరా రాజకీయాల స్పర్శ ఇలాంటి అభినవ బౌద్ధుడికి అస్పృశ్యమే. తాను అహింసావాది నన్నట్టు హింసపై కారాలు మిరియాలు నూరడం, చరిత్ర గతిలో బలప్రయోగానికి (force) గల ప్రాముఖ్యాన్ని మరవడమే. నైలునదీ బాలకుల్నీ వీత్నాం వీరుల్నీ చివరికి బాంగ్లాదేశ్ యోధుల్నీ వట్టి బడుద్దాయిలుగా మారమనేందుకు చేసే కపట ధర్మ ప్రబోధనికే తాను పూనుకుంటాడు దాశరథి. తాను కుతిక బంటిగా కూరుకుపోయిన రాజకీయాన్ని మాత్రం స్మరించక,

రణం పెంచు మతంలాగ
రాజకీయ మీనాడు
రాక్షసిలా మన పైనే
కక్షగట్టి కూర్చున్నది

అన్నాడంటేనే, ఇతడు ఎంత ఆత్మవంచకుడో తెలుస్తుంది. నిజానికి, ఈ రాజకీయం రాజకీయమేకాదు. ప్రజలు పాల్గొనే అత్యవసర లోక వ్యవహారానికీ అధికారుల కుటిలకార్యకలాపాలకూ ఉభయ సాధారణంగా రాజకీయమనే పేరు ఉంచడం తగదు. ఇజాలనేవి ఇలాంటి అంధులకు, దివాంధుల నిజానికి వ్యతిరే కార్థకాలుగా తోస్తాయి. ప్రపంచ సంక్షోభాలకు ఇజాలు, జెండాలు కారణ మనడం, ఇజాల వెనుక గల భౌతిక వాస్తవాలను గమనించి చెబితేనే అర్థమూ పర్థమూ లేకుంటే ఇలాంటి వట్టిమాటల పేర్లు నిరర్థకమే. అలాగే హింసకూ బలప్రయోగానికీ మధ్యగల భేదాన్ని గమనించక పోవడ మొకటి, ప్రభుత్వ హింసకూ ఆత్మ సంరక్షణ కోసం ప్రజలు ఆచరించక తప్పని ప్రతిహింసకూ మధ్యగల భేదాన్ని గమనించక పోవడమింకొకటి— ఇలాంటివి దాశరథిని పర్యవసానంలో ప్రభువర్గాల బాకాగానే నిలుపుతాయి. ఇతనికి విప్లవకారులైన యువకులు "హంతకులు"గా కనిపిస్తున్నారు, యువశక్తి ఉద్భ్రాంతంగా కని పిస్తున్నది. "నియంతల దురంతాలను" చూచీ చూడనట్లున్న ఈ 'మహా'కవి ప్రజలు విప్లవానికి సిద్ధంగా లేరనే మామూలు సాకుతో ఎవరో ప్రజలను "సిద్ధాంతాల విషాదాంతం" లోకి లాగుతున్నారని ఆరోపిస్తున్నాడు.

తుపాకీల హతం చేసి
కృపాకీల వెలిగించు!

ఈ మాటలు తాను చెప్పవలసింది ఎవరికి? మానవులకట! ఎవరో ఆ మానవులు? ఇలాంటి జనరలైజేషన్లు చెయ్యడం బహు తేలిక. తుపాకీల బలగం కల రాజ్య శక్తికీ సాయుధ పోరాటంలో తుపాకిని చేబట్టే ప్రజావీరుడికీ ఒకే మంత్రమా? అదే దాశరథి లాంటి కపట కృపానిధుల మొసలి కన్నీళ్ళ కవుల. కిటుకు కత్తులను నాగటి కర్రులుగా మార్చండోహో అంటూ బైబిలు కాలం నుంచి చెబుతున్నారు, ప్రవక్తలు. విననిది ఎవరు? ఆచరించనిదిఎవరు?పీడితులాపీడకులా? యుద్ధాలు,హింసలేని వ్యవస్థ ఎప్పుడు, ఎలా,ఎవరిద్వారా ఏర్పడుతుంది? ఈ ప్రశ్నలకుజవాబులు బైబుల్‌లో, త్రిపిటికాల్లో, *My Experiments with truth* లో దొరకవు,"అప్పా!... బాధామయ దీన హీన జనబంధూ! ధారుణీ నాయకా!'' అనిపించుకున్న నెహ్రూ **Autobiography** లో కంటె కనిపించవు. ఇది వట్టి కలల, వూహల విషయం కాదు, కటిక వాస్తవం. దానికీ దాశరధికీ చాలా దూరం. అందుకనే తాను "గన్ను చేపట్టా" లనుకొని పెన్నుతో కలలు కంటాడు.

కలలకైనా నిజాయితీ ఉండాలి. దాశరధికి లేనిదల్లా అదే. ఇంత విశ్వశాంతి ప్రియుడు చైనా, పాకిస్తాన్‌ల మాటెత్తేసరికల్లా మతి కోల్పోతాడు. దీనికి కారణం దేశాభిమానం అని మంచిపేరు పెట్టుకున్నా జాతీయ వాదమనే విషం. ఇది ధనస్వామ్య భావజాలానికి విహితమైన రాజకీయ తత్వం. అన్య దేశీయులను రాక్షసులుగా (జరాసంధుడు కీచకుడు వగైరా) సత్కరిస్తున్నాడంటే, ఇలాంటి కవి జాతీయవాదులనబడే ధనస్వాముల స్వప్రయోజనపరమైన స్వార్థ రాజకీయ దృక్పథానికి సాహిత్య ప్రతినిధి అవుతున్నాడని అర్థం. దీని పేరుతో తాను "సహనాన్ని విసర్జించి" కయ్యానికి తలపడతానంటాడు. కొందరి స్వప్రయోజనాల కోసమే నన్నమాట 'శాంతి'! జాతీయవాదం వైపరీత్యమే ఫాసిజం. దేశ 'భక్తి' పేరుతో అది చెయ్యని అఘాయిత్యం ఉండదు. 'ప్రజా' తంత్రాన్నీ సామ్యవాదాన్నీ కూడా అది తన ప్రచార సాధనాలు చేసుకుంటుంది. విశాలపరమైన భారత 'జాతీయత'లో అంతర్భాగమే ఆంధ్ర 'జాతీయత' ఆంధ్ర సమైక్యంగాని మరొకటిగాని వట్టి అధికార రాజకీయాలేకావు, వాటికీ ఆర్థిక మూలా లున్నాయి. పాలక వర్గంలో ఒక భాగం సమైక్యతను, మరొకటి వేర్పాటును కోరడం అబద్ధమేమీకాదు. రెండూ జనాన్ని మభ్యపెట్టజూనుకున్నాయి. జనం స్వప్రయోజనాలను అడ్డం పెట్టుకోజూచాయిగూడా.

దాశరథికి ఇవి తెలియకాపోలేదు. సమైక్యాంధ్ర తత్వం ఆయనకు మొదటి నుంచీ ఉన్నట్టిదికూడా కాదు. భాష ఒక్కటే జాతీయతకు పునాదికాదు. మరెన్నో వచ్చి చేరితేనే ఆ భావానికి పుట్టు. అందుచేత వీటిని సరిగా గుర్తించక,అధికార రాజకీయాలకు పక్క తాళంవేస్తూ సమైక్యాంధ్రాన్ని కోరడం కూడా చిత్తశుద్ధి లోపించిన వ్యవహారమే. ఆంధ్రదేశం—

అస్తవ్యస్త సామాజిక వ్యవస్థా జలధిలో
సమవాద దీప స్తంభానివి

అట! నిజానికీ దీనికి ఏమి పొంతన? మహాంధ్రోదయం మహాంధోదయమే. ప్రభుత్వం "ప్రజాస్వామ్య, సామ్యవాద" ప్రభుత్వం కాగలిగితేనే, దాని విరోధుల కార్యకలాపాలు "ఉగ్రవాద, నగ్ననాద రుగ్నబాధ" కాగలవు. అదిగానీ ఇదిగానీనిజంకాదు. అలాగే దాశరథి అహింసా వాదిగాని మానవతావాదిగానికాదు. "దుర్విప్లవవాదు" లను ఖండించి సద్విప్లవవాది కాలేదు. అజ్ఞాత యోధుణ్ణి గురించి రాస్తూ అల్లిన కవితలో—

తామ్రపత్రం కోరలేదు
ఛాయాచిత్రం నోచలేదు
అతనికి కావలసింది దేశం
అతని నరనరాల ఆవేశం

అన్నాడు గాని తనకు కావలసింది, దేశం కోసం ఆవేశమనిపించేది మాత్రమే. తనకు లభించింది తామ్రపత్రం. అధికారుల కడగంటిచూపు, పెద్దపీట, గౌరవ డిగ్రీలు, సమ్మానాలు, చివరకు ఆస్థాన (సిగ్గుచేటు ప్రజాస్వామ్యానికి) కవి స్థానం.

ఇక దాశరథి కవిత్వం గురించి విద్వాన్ విశ్వంగారే ఒక మాట రాశారు. శాంతిని 'శాంతమ్మా' అని సంబోధించిన వెనువెంటనే "చైతన్య నిశాంతమ్మా దీప్యమాన దిశాంతమ్మా: జగన్నాటక సుఖాంతమ్మా!' అని అర్థగౌరవానికి దురంతాన్ని కలిగించాడు. అంత్యప్రాసల మీద దిక్కుమాలిన వ్యామోహం ఇతని చేత వేయించే మాటల కుప్పిగంతులకు ఈ రచన శీర్షికే ఉదాహరణ. ఇతనిలో కవిత్వం ఇంకి పోయింది. వట్టిశబ్దాల గులక రాళ్లే మిగిలాయి. ఇటీవల రాసిన ఒక ఎలెక్షన్ పాటలో నీ ఓటెవరికి? సత్యానికా ముత్యానికా' అని అడిగాడంటేనే, ఏ మాట ఏ అర్థ నిర్దేశం కోసం వాడు

తున్నాడో కూడా తెలియనంతటి శుష్కశబ్ద లౌల్యానికి దాసుడై, దాశరధి కావలసిన వాడల్లా శబ్ద దాశరధి అయిపోయాడన్న మాట.

పైగా, గతించిన, లేదా గతిస్తున్న యవ్వనం ఇతని చేత వెర్రిమొర్రి ప్రయోగాలు చేయిస్తూంది. చింత చచ్చినా పులుసు చావక శృంగార సంబంధమైన పదచిత్రాలకు వ్యామోహం చూపడం ఒకటి. గాలిబ్‌లాంటి ఉర్దూకవుల్ని చూసి తాను వాతలు పెట్టుకోవడం ఒకటి, ఇందుకు కారణాలు. యక్షకన్యకూ లక్ష దీపాలతో కక్షగట్టడానికీ శబ్దంలో తప్ప ఏం సంబంధం? కాలపు పూలపాన్పుపై కేళీ కోలాహలంలో సాగిపోదలచుకున్న (ఎలాసాగిపోతాడు?) ఈ కవికి మంచు చేతగూడా కంచుకాన్ని పికిలింపజేసి, నదిచేత చేలాన్ని తొలిగింపజేస్తూ, నవయవ్వనాన్ని రివ్వుమనిపించగోరుతూ అదే చైతన్య మనుకుంటున్నాడు. తనకు ఇప్పుడు ఆ రెండూలేవు అవి తన గతం. తానే ఇప్పుడు తన గతం. భోగిమంటలో కూడా భోగాలను ఊహించుకోవలసి వచ్చింది, పాపం!' విగత యవ్వనుడు, వికృత చేతనుడు, వికల్ప కవి కాబట్టే—

"విరిసిన సౌందర్యారవిందం"లా రావలసిన భవిష్యత్తు
రోగిని రాణిని చేయలేని నర్సులా
రేసులో గెలుపొందలేని హార్సులా
కళకళ్ళాడని ఖాళీ పర్సులా
జీవం లేని ప్రీవర్సులా వస్తే

ఏం చెయ్యడం?

లేని తిమిరాన్ని కల్పించుకుని డాన్‌క్విక్సట్‌లా దానితో ఊహాసమరంగన్నుల సన్నాయి వాద్యాలతో— చెయ్యడం.

ఉన్న తిమిరాన్ని పెంచుతూ దానికి దాసోహమ్మనడం!

—విక్రమ్

---

వ్యాఖ్యారం :

**1. వేడిగాలి**

సలంద్ర కవిత (1976)

ప్రచురణ: ప్రజా సాహితి, నిజామాబాద్.

కాపీలకు: 8-5-402, డా. అంబేడ్కర్ రోడ్, నిజామాబాద్.

వెల: రు. రెండున్నర.

2. కరపత్రాల దుమారం- తరువాత బాగోతం
సంకలనం: అనంతం & లక్ష్మీకాంతం (1977)
ప్రచురణ: బుక్ లవర్స్ పబ్లికేషన్స్ వెల: మూడు రూ.
22-12-8/2 చెంగల్రావుపేట విశాఖపట్టణం 530001
సోల్ డిస్ట్రిబ్యూటర్స్: అరుణా పబ్లిషింగ్ హౌజ్, విజయవాడ

3. హంతకు లెవరు? వెల : రు. ఆరు.
(వర్గశత్రు నిర్మూలన తమ రాజకీయ విధానమని ప్రకటించిన తీవ్రవాదులు హంతకులా లేక అమాయక పౌరులను కిరాతకంగా హింసించి చంపించిన పాలకులు నిజమైన హంతకులా?)
రచన: ఆదిరాజు వెంకటేశ్వరరావు. వెలుగు పబ్లికేషన్స్
కాపీలకు : నవోదయ పబ్లిషర్స్, ఏలూరు రోడ్, విజయవాడ-2
నవయుగ బుక్ హౌస్, సుల్తాన్ బజార్, హైదరాబాదు.

---

సాహిత్య లేఖ :

పరిటాల శ్రీరాములు—చైతన్యసాహితి

.........పరిటాల శ్రీరాములు-విరసం అనే మీసంపాదకీయం చాల అవాస్తవికంగా చరిత్రను తప్పుదారి పట్టిస్తూంది. అనంతపురంలో చైతన్య సాహితి అనే సాహిత్య సంస్థను నెలకొల్పి క్రమంగా దాన్ని విరసంలో సంలీనం చేసి అనంతపురం ప్రాంతంలో విప్లవ సాహిత్య ప్రచారానికి పట్టుకొమ్మలా నిల్చినవాడు శ్రీరాములు అని రాసారు. ఇదిపూర్తిగా అబద్ధం.

విరసం సాహిత్య ప్రచారకునిగా విద్యార్థుల్ని, సాహిత్యాభిమానుల్ని కలిసి కలిపి 'చైతన్యసాహితి' ని ఏర్పాటు చేసింది జైరామ్ అనే చారిత్రిక సత్యం మీకు తెలియనిది కాదు. ఇందుకు బాగా తోడ్పడిన వారు ఇక్కడ క్రిష్ణారావు. అలీఖాన్ అనే విద్యార్థులు...ఇక్కడి విద్యార్థుల కృషి, తోడ్పాటుతో "చైతన్యసాహితి' ని ఏర్పాటు చేసి దాని తరఫున సమావేశాలు జరగటానికి కృషిచేసి "రక్తగానం" కవితా సంకలనం కూడా వెలువరించాము [ఈప్రాంతంలో విప్లవ సాహిత్య సాంస్కృతిక ప్రచారానికి నిరంతరంగా కృషిచేసిన వాడు జైరామ్ అనే చారిత్రిక సత్యం మెడమీద తలకాయున్న ప్రతివాడికీ తెలుసు] అటు తర్వాత రెండు సంవత్సరాలకు పరిటాల శ్రీరాములు "చైతన్యసాహితి" కి అధ్యక్షుడు కావడం జరిగింది. —జైరామ్, అనంతపురం. 28-8-77

## "వి.ర.సం. నక్సలైట్ గ్రూపుల ఫ్రంట్ సంస్థ" అని ఐ.జి.పి. ఆరోపణ— విరసం ఖండన

11–9–77న హైదరాబాదులో విరసం కార్యవర్గం సమావేశమై చేసిన తీర్మానాలలో విరసం విప్లవ సాహిత్య కార్యకలాపాలకే అంకితమైన బహిరంగ ప్రజాసంస్థయే కాని ఏ పార్టీకి, గ్రూపుకు కూడ ఫ్రంట్ సంస్థ కాదని తెలుపుతూ భార్గవా కమిషన్ ముందు ఐ.జి.పి. చేసిన అసత్యారోపణను ఖండించింది.

సాయుధ రైతాంగ విప్లవ కారులనూ, విప్లవ రచయితలనూ కక్షతో యిరికించి బనాయించిన సికింద్రాబాద్, తిరుపతి కుట్రకేసులనూ, యితర కేసులనూ ఉపసంహరించుకునేలా ప్రభుత్వం మీద ఒత్తిడి చేయాల్సిన బాధ్యత ప్రజాస్వామ్యవాదులపై వుందని మరో తీర్మానంలో గుర్తుచేసింది.

మూడేళ్ళ క్రితం రైల్వే సమ్మె సందర్భంగా 'సృజన' పత్రికలో కొన్ని రచనలను ముద్రించినందుకు సంపాదకురాలు హేమలతకు రెండేళ్ళ శిక్ష విధించడం పత్రికా స్వాతంత్ర్యానికే గొడ్డలిపెట్టు అని-హైకోర్టు స్థాయిలో నిలిచి వున్న ఈ కేసును పూర్తిగా ఎత్తి వేసేలా ఒత్తిడి తేవాలని విజ్ఞప్తి చేసింది.

"ప్రభంజనం" పత్రికా సంపాదకుడు, కార్మిక నాయకుడు డా॥ యం.వి. రమణారెడ్డిని ఆం.ప్ర. ప్రభుత్వం ఒక హత్యకేసులో యిరికించి యావజ్జీవ శిక్ష విధించి, అంతటితో తృప్తిపడక హైకోర్టుకు అప్పీలు చేసి మరణశిక్షగా మార్పించే ప్రయత్నాల్లో వున్నట్లు తెలిసిందని- రమణారెడ్డిని జైలునుంచి విడిపించు కోవాల్సిన బాధ్యత ప్రజలందరిపై వుందని మరోతీర్మానంలో విరసంకోరింది.

జలగం రాజకీయ దుర్మార్గాలను విచారించి హత్యానేర నిరూపణ చేసేందుకు కావలసిన సాక్ష్యాన్ని రానీయకుండా సాక్ష్యులను ఒకవైపు భయపెడుతూ, మరోవైపు లంచాలు పెడుతూ భార్గవ కమిషన్ పనికి ఆం.ప్ర. ప్రభుత్వం తూట్లు పొడిపిస్తున్నదని-వీటన్నిటినీ అరికట్టి,నేరాలకి బాధ్యులైన మంత్రివర్గాన్ని, పోలీసు అధికార్లను తొలగించడం అవసరమని విరసం తన తీర్మానంలో స్పష్టం చేసింది. దానికై ప్రజలు ఆందోళన సాగించాలని విజ్ఞప్తిచేసింది. ఇలాంటి రాజకీయ హత్యలకు ఒడిగట్టిన మంత్రి వర్గం బర్తరఫు కావాలంటూ ఖమ్మంలో ఆమరణ నిరాహార దీక్ష సాగించిన జనతాపార్టీ కా.వ. సభ్యుడు శ్రీ విద్యాసాగర్ అరెస్టునూ, నిర్బంధాన్నీ నిరసించాల్సిందిగా పౌరులందరినీ విరసం కోరుతున్నది.

రాజకీయ ఖైదీలపై ఉదారవైఖరిని చూపుతున్నట్టు ప్రజలకు భ్రమ కల్పించడానికే వారిపై కేసులు ఎత్తివేసినట్టు కొన్ని పేర్లను రాష్ట్రప్రభుత్వం

(మిగతా 4వ కవర్ పేజిలో)

(84వ పేజీ తరువాయి)

యీమధ్య పేపర్లలో ప్రకటించిందని, నిజానికి ఈ కేసుల్లో కొన్ని ఎట్లాగూ నిలవవని, మరికొన్ని చాలా గతానికి చెందినవని, అంతేగాక కొందరు ఒకటి రెండు శిక్షలు అనుభవిస్తున్నవారున్నారని ఫలితంగా ఏ ఒక్కరూ విడుదలకాలేదని విరసం తన తీర్మానంలో పేర్కొన్నది.

"జన్మజన్మల బూజు" లాంటి రాజరికం ఆం.ప్ర. ముఖ్యమంత్రిదృష్టిలో యింకా వుందనేందుకు తన రాజకీయ సహచరుడూ, సాహిత్య కింకరుడూఅయిన దాశరథిని నియమించడమే తార్కాణమని తెల్పుతూ, జీవితసాహిత్యాల్లో భూస్వామిక వ్యవస్థను రచయితలందరూ ప్రతిఘటించాలని యీసందర్భంలో విరసం సాహితీపరులకూ, సంస్కృతీప్రియులకూ విజ్ఞప్తిచేసింది. *

SRJANA is commended for use in Public Libraries in the state by the Director of Public Libraries, Andhra Pradesh Hyd. vide Ref. No. 182/A4/67, Dated 22-9-1967.

**SRJANA Telugu Monthly    Oct. 77    H/WL-10**

**Regd. No. with Registrar of News Papers 10)53/67**



SRJANA
Hanamkonda
Warangal-506001.

Yearly Subscription
Rs. 15/-

Special Number
Rs. 2/-